సాంబశివరావు, కాళ్లకూరి

రంగారాయకదన సమవాకారము అను
బొబ్బిలి యుద్ధము

కాకినాడ, 1922

Record no. 542

Sāmbaśivarāvu, Kāḷlakūri

# Raṅgārāyakadana samavākāramu anu Bobbili yudthamu

Kākināḍa, 1922

Record no. 542

## Bibliographic Record Target

సాంబశివరావు, కాళ్లకూరి.

రంగారాయకదన సమవాకారము అను బొబ్బిలి యుద్ధము / ఇది కాళ్లకూరి సాంబశివరావుచే రచియింపబడినది.- 3. కూర్పు.- కాకినాడ : కర్రా అచ్చయ్యా అండ్ సన్సు, 1922.

ii, 95 p. ;21 cm.

Record no. 542

Sāmbaśivarāvu, Kāḷlakūri.

Raṅgārāyakadana samavākāramu anu Bobbili yudthamu / idi Kāḷlakūri Sāmbaśivarāvucē raciyimpabaḍinadi.- 3. kūrpu.- Kākināḍa : Karrā Accayya aṃḍ Sansu, 1922.

ii, 95 p. ;21 cm.

Record no. 542

E F. A. EXAMINATION 1907.

# Rangarayakadana Samavakaramu

OR

THE BATTLE OF BOBBILI

Published by

Karra Atchayya & Sons,

*Book Sellers,*

RAJAHMUNDRY.



ted at SCAPE & Co., by K. Subbarayudu Brothers,

COCANADA.

1922.

# వివిధగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| సంగీతపుస్తకములు. | | ప్రసన్నముఖి | 1 0 |
| సంగీతవిద్యాదర్పణము | 3 8 | జయచంద్రవిజయము | 1 0 |
| గాంధర్వకల్పవల్లి | 2 8 | చిత్రరేఖ | 0 10 |
| సంగీతసర్వార్థసారసంగ్రహము | 0 12 | యుక్తిలక | 0 10 |
| సంగీత కళానిధి | 0 12 | శ్రీదేవి | 0 10 |
| గాయకగాయనిపారిజాతం | 0 6 | లలితకుమారి | 0 10 |
| శ్రీలపాటరామాయణము | 1 0 | పెద్దాపురసంస్థానచరిత్ర | 0 1 |
| ఘూలీసుబ్బారావుపాటలు (1) | 0 12 | ఇందుమణి | 1 0 |
| డిటో (2) | 0 12 | రాజశేఖరచరిత్ర | 1 0 |
| మంగళహారతులుసాదా | 0 4 | గణపతి 1 & 2 | 1 8 |
| డిటో పద్యము | 0 8 | సౌదర్యతిలక | 1 0 |
| నోములకథలు | 0 8 | కర్పూరమంజరి | 1 0 |
| అధ్యాత్మకీర్తనలు | 0 10 | అహల్యాబాయి | 0 12 |
| పెద్దకుమ్మెల కథ | 0 8 | హేమలత | 0 12 |
| చిన్న డిటో | 0 4 | రాజరత్నము | 0 12 |
| కౌరవులయుద్ధము | 0 8 | సిద్ధార్థచరిత్ర | 12 |
| కుసలాయకము | 0 4 | రఘుకులచరిత్ర | 0 10 |
| అభినయస్వయంబోధిని | 2 8 | రామచంద్రవిజయము | 0 10 |
| అభినయ దర్పణము | 1 0 | అరిహాసింగరి | 0 8 |
| హాస్యపుస్తకములు | | హామీరసింగు | 0 12 |
| ప్రహసనములు వాల్యుం క౧॥ మి॥ | 3 0 | విక్రమసింహ | 0 12 |
| కంఠాభరణము | 0 12 | పురంజయ | 0 12 |
| వేశ్యామధురము | 0 12 | రమణి | 0 12 |
| వేశ్యాహితబోధిని | 1 0 | ప్రియాన్వేషణము | 0 9 |
| లోకాభిరామాయణము | 0 6 | కాశీమజిలీ మొదటివాల్యుం | 1 8 |
| హాస్యపాటలు | 0 4 | డిటో రెండవవాల్యుం | 1 8 |
| వినోదములు | 0 8 | డిటో మూడవవాల్యుం | 1 12 |
| | | డిటో ఆరవవాల్యుం | 1 8 |
| | | డిటో ఏడవవాల్యుం | 1 12 |
| నవలలు | | | |
| పద్మావతి | 1 4 | డిటో పదిమూడవవాల్యుం | 1 12 |
| సాక్షి | 2 0 | అయిదు మూడు అచ్చుతా | |

వలయువారు:— కర్రా అచ్చయ్య అండ్ సన్సు,
బుక్కుసెల్లర్సు, రాజమండ్రి.

శ్రీ

# రంగారాయకదన సమవాకారము.

అను

## "బొబ్బిలి యుద్ధము."

ఇది

కృష్ణాజిల్లా, నూజివీడు సంస్థానం వుయ్యూరెస్టేటు శ్రీకుమార
రాజావారి ట్యూటరగు

కాళ్లకూరి సాంబశివరావుచే

రచియింపబడినది.






రాజమండ్రి బుక్కుసెల్లర్సు

కర్రా అచ్చయ్య అండు సన్సువారిచే

ప్రకటింపబడియె.

మూడవకూర్పు ౧,౦౦౦ ప్రతులు.

కాకినాడ:

స్కేపు అండు కో., కె. సుబ్బారాయుడు బ్రదర్సువారిచలన
ముద్రింపబడియె.

1922



[దీని వెల రు 1—0—0.

# పీఠిక. 17033

ఆంధ్రభాషాభిమానులారా!

ఇది గడచిన 1757-వ సంవత్సరమున జనవరినెల 26-వ తేదీని బొబ్బిలివారికిని విజయనగరంమహారాజుగారికిని జరిగిన యుద్ధకథ. ఇది ప్రబంధముగాను, ద్విపదగాను, పాటగాను రచింపఁబడి పండిత పామరుల కమితానందంబు సంధిల్లఁజేయుచున్న దని నేను వేఱే చెప్ప నక్కఱలేదు. అట్టిసంతోషమునకుఁ గారణము బొబ్బిలిజనులశౌర్యాతిరేకమేగాని కథారచనాచమత్కారము గాదు. దృశ్యప్రబంధముగ నుండినఁ జూపరుల కపరిమితానందంబు గల్గు నని యెంచి స్నేహితులచేతఁ బ్రేరేపింపఁబడి యీకథాసరళి కొంచెము మించుమించుగ సమవాకారలక్షణమును బోలినహేతువుచేత సాధ్యమైనంతవఱకు దాని ననుసరించినాఁడ. మార్పులు కావలసియున్నచోట్ల నాంధ్రభాషాధురీణులు దయతోఁ దెలియఁజేసినం గృతజ్ఞతాపూర్వకవందనములతోఁ గైకొని మఱియొకకూర్పున సవరించుకొనుచున్నాఁడను. ఈగ్రంథరచనలో దిట్టకవి నారాయణకవికృత రంగారాయచరిత్ర కడుసాహాయ్యం బొనర్చినది. మఱియుఁ గొంతవృత్తాంతము కార్మైకిల్ దొరవారు వ్రాసిన విశాఖపట్టణం డిస్ట్రిక్టుమాన్యూయల్ నుంచి కొంత యోరమ్‌దొరవారు వ్రాసినచరిత్రనుంచి కొంత శ్రీబొబ్బిలి మహారాజావారి ముఖస్థముగను గ్రహింపనయ్యె. సాధ్యమైనంతవఱకీగ్రంథస్థ మగుచరిత్ర వాస్తవ మని నొక్కి చెప్పఁగలను. ఇక్కథానాయకుఁడగు శ్రీగోపాలకృష్ణరంగారావువారి కిప్పుడు బొబ్బిలిసంస్థానంబు నేలుచున్న శ్రీరాజా మెహర్బాని, దోస్తాన్ శ్రీమహారాజా రాజారావు సర్ వెంకటశ్వేతాచలపతి రంగా

రావుబహద్దర్, కే. సి. ఐ. ఇ వారైదవతరమువారగుటచే నీగ్రంథము వారియభిమానచారిత్రాభివర్ణనమే గాన వారికే కృతి నియ్యఁ దలఁచి గడచిన మార్చి 30-వ తేదీని శ్రీవారిసభలోఁ జదివి వారికిఁ గృతినొసంగి నాఁడను శ్రీరాజావారు నమితభాషాసరసు లగుటచే రసంబు గ్రహించి యపరిమితసంతోషసంపూరితాంతఃకరణు లగుచు నన్ను నేకవిధంబుల సన్మానించినదేగాక రెండుకూర్పుల నీయీగ్రంథము నచ్చొత్తించుభారంబును వహించిరి. శ్రీవారికిని వారికుమారరత్నములగు శ్రీరాజా వెంకటకుమారకృష్ణరంగారావువారికిని శ్రీరాజా రామకృష్ణరంగారావుగారికిని దైవ మనిశంబు శ్రేయంబుల నొనగూర్చుఁగాత!

కా. సాంబశివరావు.



## ఇష్టదైవస్తుతి.

శా. శ్రీనాథక్షితిమేరుభూధర సురజ్యేష్ఠాగమాబ్జార్క లిం
పూనన్ రాజదజింహ్మగోరురథ ధర్మోగ్రేద్ధసవ్యేష్టకా
జానేయప్రజచక్రయుగ్మమయి చంచద్ఘోరసంఖ్యంబులో
నానక్తంచరకాలసంజ్ఞపురదిష్టాంతంబుఁ గావించి మేల్
క్షోణి న్నింపిన సాంయుగీనున కెదన్ జోహారుఁ గావించెదన్.

## కృతిపతిస్తుతి.

శా. శ్రీరాజీవభవాండమండలఫలస్ఫీతంబు దీవ్యద్యశ
స్సౌరభ్యప్రథితంబు సద్గుణసుమస్ఫారంబు కామప్రదం
బారూఢాత్మకవీంద్రచిత్త మధుపౌఘాసేవ్యమానంబు నా
శ్రీరంగాధిపకల్పకంబు విజయశ్రీ నేలు రంగాధిపున్

క. రాజునహిరాజు నంబుధి
రాజు సుమారాజు నద్రిరాజు నఖిలగో
రాజు హసియించి బొబ్బిలి
రాజులసత్కీర్తి దిగ్విరాజుల నేలున్.

సీ. చక్రరత్నకళాశాలి యాతం డని చక్రరత్నకళాశాలి యగుచుఁ
కమలాధికామోదకారి యాతం డని కమలాధికామోదకారి యగుచు
సతతసన్మార్గసంచారి యాతం డని సతతసన్మార్గసంచారి యగుచుఁ
బ్రాకటాఖిలలోకబంధు వాతం డని ప్రాకటాఖిలలోకబంధు వగుచు

గీ. శూరుఁ డాతఁ డని త్రిలోకశూరుఁ డగుచు
నా ప్రభాకరుతో నీప్రభాకరుండు
సాటి యన నొప్పితివి రాజసార్వభౌమ
రంగరాయనృపాల శ్రీరమ్యశీల!

గీ. మీకులము వారిదైన సమీకచరిత
మె, సమవాకారముగఁ జేసి మీకుఁ గృతి నొ
సంగుచున్నాఁడ గొనుఁ డగ్రజాత్య కాళ్ల
కూరి సాంబశివామాత్యధీరుఁ డనిద.

ఈరూపకమునందలి ప్రధానపాత్రలు.

---

రంగారావు—బొబ్బిలిరాజు.

వెంగళ్రాయఁడు—రంగారావుతమ్ముఁడు.

చినరంగారావు—రంగారావుకుమారుఁడు.

దామరదమ్మన్న
ధర్మారావు
చెలికానివెంకయ్య
తాండ్రపాపయ్య
పంతెనబుచ్చెన్న
నరసరాజు
} రంగారావుబంధుమిత్రవర్గము.

విజయరామరాజు—విజయనగరమహారాజు.

జగన్నాధరాజు—విజయరామరాజుమంత్రి.

వత్సవాయన్వయుఁడు—పెద్దాపురరాజు.

బుస్సీ—ఫ్రెంచిగవర్నరు.

హైదరుజంగు—బుస్సీమంత్రి.

గోరుందొర—కమాండరించీఫు.

లక్ష్మన్న—బుస్సీదుబాసీ.

మద్దాలరెడ్డినాయఁడు—గోరుందొరదుబాసీ.

నాగోజీరావు—హైదరుజంగుగుమాస్తాలలో ముఖ్యుఁడు.

లూయిమట్రెన్—గోరుందొర నంపినవకీలు.

లా, రాసూ, లాడూఖాన్, లాసుఖాన్, హాసనల్లీఖాన్, షుకురల్లీ, సిద్దీబిలాల్, కుప్పి, కుప్లాము } ఫరాసుపారసీకపుజోదులు.

మల్లమ్మాదేవి—రంగారావుభార్య.

నాటి



శ్రీ

# రంగారాయకదన సమవాకారము.

## ప్రస్తావన.

### నాంది.



రంగావనినాథుఁ డాప్రథితలక్ష్మీసంశ్రయుం, డాశ్రితా
ధారుం, డుగ్రరణప్రమోధి విజయోదారానుగుం,
డంచితాచారుం, డూర్జితుఁ, డప్రమేయుఁడుగుణస్ఫా
రుండు, మీనధ్వజాకారుం, డెల్లప్పు, డిచ్చుమీకు
నిఖిలాఖర్వప్రభాశ్రేయముల్.

(నాంద్యంతమున.)

సూత్ర—నటీ! ఇటు రమ్మా.

నటి—చిత్తము. ఆర్యపుత్రా! ఏమి సెలవు?

సూత్ర—ఇప్పు డియ్యెడఁ గూడియున్నసభం దిలకించితివా?

నటి—చూచుచున్నా నార్యపుత్ర!

సూత్ర,-నటీ! ఈసభ సుధర్మం బోలె విబుధమండలవిరాజితంబై, కాసారంబురీతి రాజహంసాశ్రయంబై, కైలాసంబుభాతి సదార్యానుకూలంబై, కరిపురంబువడువున గౌరవయోగ్యంబై, బ్రహ్మగేహంబుకైవడి భారతీనిలయంబై, యలకాపురంబు చెన్నున ధనదపరిధానంబై, కలశార్ణవంబుకరణి సంపజ్జనకంబై యొప్పు మీఱుచున్నది. చూచితే?

నటి—పండితపుత్రా, నిజము, ఇప్పు డేమనియెదు?

సూత్రి—నటీ! వీరియుల్లంబులు పల్లవింప నేదేని యొక్క యపూర్వకథాప్రసంగంబు నడప వలె నని—

నటి—అట్లయినఁ గానిమ్ము, కాని సమస్తదృశ్యప్రబంధంబులును బ్రదర్శింపఁబడినవే. ఇఁక నపూర్వ మేమున్నదో?

సూత్రి—నటీ! నీవెన్నఁడైన "రంగారాయకదన సమవాకారం"బన విని యుంటివే?

నటి—లేదు. అదెట్టిది?

సూత్రి—నటీ! అది బొబ్బిలివెలమదొరలకును, విజయనగరము రాజులకును జరిగినయుద్ధకథ.

నటి—అట్లయిన నది యపూర్వమైనదే. దీని నెవరు రచించిరి?

సూత్రి—చెప్పెద వినుము.

సీ. కాశ్యపూర్యన్వయకలశపాథోరాశి రాకానిశీథినీరాజవరుఁడు
సప్తర్షివర్యసందీప్తభారద్వాజ సత్ప్రాభవగోత్రసంభవుండు
ప్రస్ఫుటభోగరాట్పాపమాంబా గర్భశుక్తిముక్తామణిస్ఫూర్జితుండు
ప్రథితాంధ్రగీర్వాణభాషామహోన్నత వైదుషీవిశ్రుతిభాసురుండు
సాంబశివరాయకవి బుధజనవిధేయుఁ । డిదిగో రచియించె బొబ్బిలికదనచరితము
సమవాకారముగ రసస్ఫూర్తి యెసఁగ । సకలజనమానసాహ్లాదసరసఫణితి

నటి—నీయంతట నీవే ప్రదర్శింప నెంచితివా? లేక సభ్యుల యనుమతమా?

సూత్రి—నటీ! నాయిష్టము గాదు. వారలే కోరిరి.

నటి—సరే! సభ్యు లంత గొప్ప వారని యుంటివే! ముచ్చట దీరునట్లు వారి నెట్లు రంజింపఁ గలుగుదుము.

సూత్రి—నటీ! ఎంతవెట్టిదానవు. మూర్ఖుల రంజింపఁజేయుట కష్టము గాని ధీరులను రంజించు టెంతపని.

గీ. రాజహంసలు క్షీరనీరములు వేఱు । పరచి క్షీరంబె కైకొని పరఁగుపగిది
సుగుణదోషము లేర్పడఁ జూచి గుణమె । కైకొనం జాలువారలు గారె బుధులు.

నటి—ఆధైర్యమే నీకున్నచో నుద్యోగింపుము.

సూత్రి—మున్ముగఁ దత్సూచకం బగుశరదృతువర్ణనం బొనర్పుము. నటీ!

నటి—ఆపనికి నన్నే నియోగించితివా! కానిమ్ము. ప్రయత్నించెదను.

చ. శరములు నిర్మలతం ... ష్ణదులందు నెల్లెడన్
శరములు ... రదలక్ష్మీమడుంగులో యనన్
శరములు పూని శాత్రవులు జన్యములం బచరింపసాగిరీ
శరదమలాంబుదంబులు ప్రచన్నసుఖై ప్రబలె న్నభంబునన్.



చ. సురుచిరరంగరాయనియశోరుచు లీసరణిం బ్రశస్తమై
ఖరిఁ బ్రసరించె నావిశదకాంతి శరద్వరచంద్రికల్ దిగం
తరముల నిండె మౌక్తికసుధారజతావని భృత్సురాపగా
సురభిపటీరహీరశరసూనములన్ హసియించి మించుచున్.

సూత్రి—ఆహా!

గీ. హాయిగా నీవు గావించినట్టిశార । దాభివర్ణనము సుమనోహారి యై స్వ
భావసిద్ధంబునై యిప్డు ప్రబలుచునికి । నీదుచాతుర్యమే వర్ణనీయ మయ్యె.

నటి—సరే! నాపాట నసూయ నేయక సంతసించితి వింతే చాలును.

సూత్రి—సుజనుల తెఱం గది గాదుగదా!

క. "దిద్ద వలెఁ దప్పు గలిగిన । ముద్దుగ వైఘంటికంబుమూలను గని తా
రెద్దియుఁ జూడక రోసెడి । గద్దరికుమతులను లెక్క గాంతురె సుమతుల్."

ఇంతే గాక మున్ను.

క. అలబొబ్బిలిరావుకులీ । నులయున్నతిఁ గాంచి యోర్వ నోగిలి యసూయా
కులుఁ డైనపూసపాటిన్ప । తిలకుం డేపాటి గీరితిన్ జెందె నిలన్.

నటి—త్రైలోక్యవిజయుఁ డగువిజయరామరాజు కోల్పోయిందుతతి యయ్యె. చాలుం జాలు! మన మీపాటి పోవుదము పద.

సూత్రి—అవునది నిజమే.

(అని నిష్క్రమించు చున్నారు.)

ఇది ప్రస్తావన.





శ్రీ

# రంగారాయకదన సమవాకారము.

## ప్రథమాంకము.

ప్రవేశము—విజయరామరాజు సభ.

[విజయరామరాజు, మంత్రి జగన్నాథరాజు
ప్రవేశించు చున్నారు.]

రాజు—మంత్రిపుంగవా!

మంత్రి—మహాప్రసాదము, రాజా!

రాజు—నామనంబు చింతాకరం బయ్యె. సౌఖ్యరాహిత్యం బగు వైభవమ్ము మరాళవర్జితకాసారంబు గదా! అడవిఁ గాచినవెన్నెలకైవడిని నాజన్మంబు సాఫల్యము నొందమికి నా డెందంబు గడుఁగుందు చున్నయది.

గీ. చింతచితి యనురెంటిలోఁ జింత ఘనము। మానసంబున నూహింప మాన్యచరిత
వినుము చితికాల్చునిర్జీవులను బుడమిని। జింతకాల్చును లోలోన జీవయుతుల

మఱియును.

గీ. అంతిపురము ను విజనంపుటడవిగ, వని। నంతిపురముగఁ దోఁపింప స్వాంతమనుమ
కారణం బగునన్యంబు గాంచలేదు। వేయివిధముల నరసిన విబుధవరుఁడు

మంత్రి—రాజేంద్రా! వైభవమ్మున నింద్రుని, ధర్మంబున బలిని, పరాక్రమంబునందుఁగ రాయని మించి భూపాలుర నదిమి కప్పంబులు గొంచుఁదనయూర్వి కామధేనువు నావిధివిధానమ్మున రాజ్యంబు సేయు మీకుఁ గొఱంత గల్గునా!

గీ. అట్టిదుర్వ్యాకులం బేయహమునఁ గాని। పొందఁ గా రాదు మీవంటిపురుషులకును
విభవసంస్ఫూర్తిజితనృప! విజయరామ। రాజ! రాజన్యలోకమార్తాండమూర్తి!

రాజు—మంత్రివరా! నీ వెంతపొగడినను రంగారాయశబ్దము వినినప్పటినుండియు మనం బెఱిసెడిని. ఏలనన!

శా. బాల్యంబాది యసంఖ్య మా యపకృతుల్ వా రెన్నియో చేయ సా
కల్యం బేర్పడ సావిధోద్భడమి నేఁ గార్పణ్య మొప్పారిత



త్సల్యంబు ల్పచరింపఁజాలక యె మద్దోర్దర్ప ముంకింపకే
లౌల్యం బా గతి నూరకుంటిని గదా లా వెంతయు న్గల్గినన్.

ఇంతే గాక.

క. ఎన్నంగరానిదుష్కృత। పన్నగ విషబాధ కోర్వఁ జాలైతిని ద
త్పన్నగపదంష్ట్రావళి। నెన్నిక మున్మున్న డుళ్ళ నేయనయితి హా!

గీ. గోటఁజిమ్మదాని గొడ్డంటఁ గొట్టంగ। వలసె నన్నమాట పాటి యయ్యె
నయ్య నేమి వారివాజిని హతులుగ। జేసి సార్థకంబుఁ జేతు నభిధ.

మంత్రివరా! వైరిక్ష్మాజానిచక్షుశ్శ్రవం బక్షీణోదగ్రజిహ్వాగ్రంబుల క్ష్వేళంబుఁ గ్రక్కుచు క్షణక్షణంబును బొంచి యుండ నా కెట్లు క్షేమంబు గల్గును?

మంత్రి—రాజేంద్రా! పరమార్థం బొకటి గల దాకర్ణింపుము.

గీ. తుష్టి కలదేని వనమునందునన యున్నఁ। దోఁచు సుఖముగ జనునకుఁ, దుష్టి లేక
యున్నఁ బురివాన్న వనమున నున్నరీతి। సుఖము బొందక యుండును జూడ నరుఁడు.

రాజు—అది నిజమే, గాని పరాక్రమశూను లగురాకుమారుల కిల నరివీరుల దురంబులం బరాజితులం జేసి వారియుర్వరమలఁ గొనుట ధర్మము కదా!

శా. రత్నస్థాపితవస్త్యపఙ్క్తి యను శక్రప్రస్థసామ్రాజ్యమున్
నూత్నవాపకయక్షకర్దమసదన్యానోత్తరాసంగముల్
యత్నోపార్జితఘోటకద్విపసమూహాప్రభవశ్రీలు స
త్పత్నీరత్నకదంబ మెల్లఁ దులయే పాంచద్యశోలక్ష్మికిన్.

కాన మంత్రివరా!

గీ. కలితతజ్జయలక్ష్మి సంగ్రామసీమ। బొబ్బిలిక్షితిరాజన్య భూరిగోత్ర
భూద్వితీయాభ్యుదయ కంఃపూజ్యసూత్ర। పటలవిచ్ఛేదిగాని నాపాణి ,మేల ?

మంత్రి—రాజేంద్రా! అట్టిధర్మం బరాతివీరులయెడఁ దగినదే? "యతోధర్మస్తతోజయ" యన్నసూక్తి మనము విని యుంటిమి గదా? ఎచ్చట నధర్మంబుండు నచ్చట నాశంబగు. చింతింప నేల! అయినను

పంచచామరము. బలాబలంబు లెంచి పొంచి బల్మి నోర్వఁగా వలెన్
హళాహళిన్ దురంబులో మహారివీర సంతతిన్
ఝళంఝళాదవంబు లొప్ప శస్త్రము ల్చరింపఁగా
భళీభళీ యటంచు మింట బల్సుపర్వు లార్వఁగన్.

ప్రియంవదావృత్తము. అరుల గెల్వఁ దటి యైనయపుడా
యరినరాధిపుల నాజి గెలువన్

గరువ మేర్పడును గాని సమయం
బరయకుండ నన వర్షా మగునే.

జనపాలా ! నీ కెల్లప్పుడు హితముం గోరి సమయాసమయంబు లారసి యరాతి వీరుల నోర్చుకాలంబు సమకూడ నేనూర కుందునే ?

రాజు — అమాత్యవరా ! నీవు దాకుచ్చినది నిక్కువంబే కాని, ప్రక్క నరివీరరంగరాట్పన్నగంబు బొబ్బిలిప్రాకారవామలూర్వంతరస్థాయియై యుండె ననుచింత యంత రంగకకుబంతకుహారభేదనంబు గావించు చున్నది.

మంత్రి — రాజేంద్రా ! విను మరాతివీరబలోద్రేకంబు మనకనుభవైక మేద్యమే.

గీ. వైరివీరు లపారదుర్వారు లనుచు । మక్కువాదిస్థలంబుల మనకుం దేట
పడియెం గాయింక నెందు కీపాటిదాడి । సమయమును వేచియుండుట చక్కనగును.
అది గాక.

గీ. అచటం బుట్టిన ననగొమ్మ యైనంజేవ । చేత రాజిలు వీరులం జెప్ప నేల ?
ప్రథితబలరాజు లతుల పరాక్రమమ్మగ । రాజు లారయ బొబ్బిలిరాజులెల్ల.
మఱియును.

గీ. వారిమాహాత్మ్య మెన్నంగ వశమె మనకుం । జండదోర్దండకాండప్రకాండకాండ
కలనం బెద్దలు వారలు ఘనచమూర్థ । తిని మనము బెద్దలను నిజస్థితిని గనుఁడు.

రాజు — నీవును వారిమహిమ నే యెక్కుడుగం దలంచు చున్నావా ?

మంత్రి — లేదు. రాజా ! దురంబుల కరుగ నుత్సహించుతతి నెదిరిబలంబును నిజబలంబును మన మాలోచించుకొనవలయును గదా ! అందుకొఱకై చెప్పినాఁడను గాని వేఱు గాదు.

[కంచుకి ప్రవేశించు చున్నాఁడు.]

కంచుకి — మహాప్రభూ ! మీదర్శనంబున కిద్దఱుబ్రాహ్మణులు వచ్చి ద్వారంబున వేచియున్నారు.

రాజు — సేవకా ! వారి నిటుల బిలువుము.

సేవకుఁడు — చిత్తము. దేవరా ! (అని యరుగు చున్నాఁడు.)

[బ్రాహ్మణులు ప్రవేశించు చున్నారు.]

రాజు — లేచి చేతులు మోడ్చి (ప్రకాశముగా) నమస్కారము. భూసురోత్తములారా !

బ్రాహ్మ — విజయీభవ. (అని యాశీర్వదించు చున్నారు.

రాజు — మేదినీసురులారా ! ఇటుల నాసీనుల రగుడు.

బ్రాహ్మ — ఆసీను లగు చున్నారు.



రాజు — భూదేవోత్తములారా ! ఎచ్చటినుండి విచ్చేయు చున్నారు ?

బ్రాహ్మ — భూవరా ! వీరబొబ్బిలిసంస్థానంబు వెలువడి వచ్చు చున్నాము.

రాజు — అచ్చటివింత లేమి ?

బ్రాహ్మ — నరేంద్రా ! అచ్చటివింతల నెంత లని తెల్పుదుము. వత్సరంబునం గలద్వాదశమాసంబులు విచ్చలవిడిం జరించుచు నందందుల రాజచంద్రుల దర్శించుచు వారి మాహాత్మ్యంబులు చూచు చుంటిమి గాని రాజన్యానేకపసింహు లనందగినబొబ్బిలి కాశ్యపీవరులవంటివారి నెందేని విని యుండ లేదు.

రాజు — (తనలో) ఏమి పొగడు చున్నారు నేను గూడ విశేషధన మొసంగితినా నన్నిట్లే యొండుచోటం బొగడుదురు.

బ్రాహ్మ — శా. భీమాటోపసుధీస్థిరత్వమహిమావిశ్రాణనాంచద్యశః
ప్రామణ్యంబుల నీనకింతురు సుమా పాండుద్వితీయాత్మజా
తామర్త్యాళిగురుప్రమేరు రవిపుత్రానంతవర్ణంబు నిం
కేమన్యు ల్సను మాదు రిమ్మహి నిదే యీరాజలోకంబునన్.

మఱియును.

గీ. అంటిపొడిచి వేగ గెంటు వెంబడి దూరు । నదురు గుండె పిక్క చెదురు లేక
దురమునందు రిపుల దుర్వారశక్తిచే । రాజవరుఁడు రంగరాయఘనుఁడు

రాజా ! ఆగోపాలకృష్ణరంగరాయకుమారవల్లభుప్రాభవంబు వర్ణింప వేనోళ్ళ చిలువకైనను దరంబు గాదు.

గీ. పుడమి నెంతటినో రాజపుంగవులను । గంటిమే గాని లే రిటువంటిదాత
ధన మొసంగం గుచేలుండు ధనదుం డగును । శిక్ష సేయం దలంచిన శివుం డతండు.

గీ. పుణ్యజనులను గాచింపం బూనె రంగ ! రాయం డనువాడు మాపె నీరంగరాయం
డాత్మలోనం దలంచి నిరంతరంబు । పుణ్యజనులను రక్షించు పూన్కిం బూని.

రాజు — ఆహా ! నిజమేనా ? ఏమి పొగడు చున్నారు ! లోపలకుం బొగడుట నైజము. తక్కినగుణంబు లెట్లున్నను మీకు విశేష మొసంగినవారే దానకర్ణులు. మంత్రివరా ! ఈబాపలను బంపివేయుము.

మంత్రి — మంచిది. రాజేంద్రా ! (అని వారిని బంపివేయు చున్నాఁడు.)

బ్రాహ్మ — ఇదేమి ? వారిని బొగడితి మని కాంబోలు ! మనలను వచ్చినదారిన పొమ్మనె. ఎంతవెఱ్ఱిపని చేసితిమి ? (అనుకొను చుం బోవు చున్నారు.)

రాజు — మంత్రిపుంగవా ! ఈబ్రాహ్మణులవర్ణన నిజ మైనదియే ?

మంత్రి—కొంత నిజమే. దాని నతిశయముగఁ జెప్పి యున్నారు. లోకమందిట్టిది యాచకులకు సహజమే గదా ?

రాజు—సచివాగ్రణీ !

గీ. దానరాధేయు లఁట సుప్రతాపశాంను। లఁట యుపాయవిదు లఁట సప్తాంగధుర్యు
లఁట్రతగ వ్వారు నేను గానఁటకనుమిది। తెలిసెను నాక్షాత్రముల్ వారివెలమతనము.

(వారొనర్చినయపకృతి నెదఁ దలంచి తన్నాపంకించుచు ప్రకాశముగా) ఈపట్లవారిని వదలివేయఁ జనదు.

మంత్రి—(స్వగతము) ఆహా ! ఈరాజు రావువంశపయోధిసుధాంశుం డైనగోపాల కృష్ణరంగరావుసరళి యరసి చూ పావక నిర్హేతుకజాయమానక్రుధాకలితుఁ డగుచు దుర్వ్యథచే బాధితుఁ డగు చున్నాఁడు. బలాబలంబులం దెలుప నే నిన్నమాటల చేతనే కుందు చుండఁగా గోరుచుట్టుమీఁద రోకంటిపో టన్నట్లు బ్రాహ్మణులు కూడ సమకూడిరి. కూడిరి పో శత్రురాజవర్ణనఁ గూడ నేల గావించిరి ? చాన దండతాడితభుజంగంబుభాతి నుగ్రుఁ డై యున్నాఁడు. (ప్రకాశముగా) రాజా గ్రణీ ! శాంతి వహింపుఁడు. అరంగ్గా వి క్తతేఁ దను కెట్టియపకారంబుఁ జేసిన వాఁడు ? నిర్హేతుకంబుగ నిట్టికోప మేల? ఇత్తటి నారాజుపై దండెత్తినచో నన్యాయయుద్ధం బని జనులు మనలను నిందింతురు గాన.

క. కారణములేక కార్యము। గా రా దని పెద్ద లండ్రు గావున రంధ్రిం
బారసి రాజోత్తమ ! ప్రతి। కారం బేమైనఁ గాని కావింప నగున్.

రాజు—కారణము లేదా? నీకుఁ దెలియ లేదు కాఁబోలును.

ఉ. ఇప్పుడు వాఁడు సేయుపని యేమొ యెఱుంగవె? యింక నేమి వా
తప్పులు సేయఁగా వలెనో? తద్దయుఁ బారెడుకొండ కాల్వలం
జప్పున నడ్డుగట్టి బలుసస్యము పండఁగ నాత్మరాజ్యముల్
జొప్పడఁ జేసెఁదా నెదురఁ జూడవే? న్యాయముఁ దప్పె నీసునన్.

నీ విట్టివెడఁగుమాట లాడకుము. ఉత్తమమైనక్షత్రియవంశంబునఁ బుట్టి, క్షాత్రమింతైనను లేక యిట్టిపిఱికిమాట లాడ నేమిమగతనంబు? ఎట్లైన నారాజుం జయించి వీరలక్ష్మిం జేకొందుం గాక.

మత్తకోకిల. వీరవంశమునందుఁ బుట్టియు భీరులన్ రిపులన్ నుగం
భీరులఁన్ బొలియింపలేనిది విశ్రుతం బగుక్షాత్రమే ?



శూరుని న్దరమందు నోర్చి విశుద్ధకీర్తిని బొందదన్
కారుబీరము లాడుచుండుట గాదునుమ్ము యథార్థముల్.

మంత్రి—(స్వగతము) అంతకంతకుఁ గ్రోధంబు హెచ్చి యెదిరిబలం బెఱుఁగనివాఁడై యిట్లనుచున్నాఁడు. నే నిప్పుడేమన్నను వినువాఁడుగా లేఁడు. పోనిమ్ము నా కేల? ఎవఁ డెంతచేసికొను నంత యనుభవించును గదా ? (ప్రకాశముగా) రాజేంద్రా ! మీరట్టి పౌరుషవంతులే.

రాజు—పౌరుషముకంటె జీవనము పెద్దయే? పౌరుషహీనుఁడై బ్రతుకుటకంటె సమరంబున నరాతివీరులచే మడియుట మేలు. ఈకాయం బనపాయంబుగాదు గదా? నవలక్షకళింగాధిపతినై యుండియును వేయిమడుంగులు తక్కువయగు బొబ్బిలి రాజులపాటియశంబును బొందలేక కీర్తిలక్ష్మిని జేసేత వారిపా లెట్లు సేతును?

మహాస్రగ్ధర. ఘోరంబౌ మత్ప్రకాండాగ్నుల వెలమకులాంకూరముల్ గాల్చినైతున్
వీరాటోపం బెలర్ప న్విమతుల సమరోర్వీస్థలి న్జెండి నైతున్
బ్రారంభానీకధాటిం బ్రకటితవిజయం బంది బొబ్బిల్లడీనిన్
ధీరౌద్ధత్యంబు పేర్మిన్ స్థిరముగ నిజదోర్దీపశక్తిన్ భరింతున్.

అట్లుకాదేని.

గీ. రంగరాయఁడొండె రంగద్విజయరామ। రాయఁడొండె నుభయరాజ్యములను
రిపుల నోర్చి యేల విపుల భీమాహవ। కేళియందు నిజజనాళి మెచ్చ.

అట్లు గాన మంత్రివరా ! నాయుద్యమంబునకుఁ దగినప్రయత్నం బొనఁగూర్పుము. ఆరాతివీరులబల మే నెఱుంగనిది గాదు. వారును శౌర్యాన్వితులే. అట్టివారిని దురంబున జయించినదే జయము. పిచ్చుకమీఁద జంద్రాయుధ మన్నట్లు గంభీరులకు దాగి భీరులైనవారిపై దాడి విడిసిన ఫేటినడువడి ?

మంత్రి—అది నిజమే గాని,

గీ. జన్యముల కేగుకాలంబు చక్కనెఱఁగి। పగరబల మెంచి సప్తాంగపటిమ నెఱపి
పగను సాధింప నుంకింప వలయుఁ గాని। తలఁచినప్పుడ సమకట్టఁ దగవు గాదు.

రాజు—పోనిమ్ము. మన కపకార మొనరించిరా లేదా ?

మంత్రి—దానివలన గోపాలకృష్ణరంగారావు సునకు నికార మెంచెనో లేదో?

రాజు—నీవింక నన్నియెడ వేల ?

గీ. నిర్ఝరము లడ్డి మనచేల నీరు వాఱ। నీక మనరైతు లంతట నాఁక వెట్ట
మన్నెవారంత వారల మట్టిరి యఁట ! తగునె వారికి? నింతయుఁ దలఁపనైతి.

ఇందు కేమనియెదు?

మంత్రి—రాజా! అది యకార్యమే కాని మొదట సామదానభేదంబుల వారితో ముచ్చటించుట మంచిది.

రాజు—మొదటినుండియు నాయం దసూయాభావమునే మనఃబొందుపఱచియున్న రంగారావు నాతో రాజకార్యసరణిం బొత్తొనరించునా? నీవుచెప్పినది యొప్పుగ నున్నది. ఏమినీతి చెప్పితివి! నన్నంత నీచపఱచిన వానితో నా సామదాన భేదోపాయంబులు?

మంత్రి—

గీ. ఎట్టికార్యములందైన నేలిక! మును। మున్న ప్రతికారమునకును బూనుపట్ల
సామదానభేదంబులఁ జక్కఁజేయఁ। గాకయుండినఁ దండంబె కడఁక దగును.

రాజు—

క. ఆలోచన లెన్నియు నిం। కేలా యీయెడల మనకు? నింతేనియు లోఁ
జాలిఁ దలఁపఁ దగదు తగవు। మాలిన యావెలమ దురభిమానులయెడలన్.

కాన మంత్రివరా! పరిపరివిధంబులఁ దద్విధానంబు మనంబున నాలోచించుచుంటిని. నీవు నాప్రయత్నంబునకే కడఁగుము.

(నేపథ్యంబున)

కళింగాధిపుఁ డెచ్చట నున్నవాఁడు? (అందఱు నాలకించుచున్నారు.)

సేవ—మహాప్రభూ! ఎవ్వరో యిద్దఱుతురకబంట్రోతులు వచ్చి రాజుం జూపుమని యట్టహాసము చేయుచున్నారు. సెలవైనఁ దోడ్కొని వత్తును.

రాజు—తోడ్కొని రమ్ము.

సేవ—చిత్తము. (అని పోయి వారిని వెంటఁగొని వచ్చుచున్నాఁడు.)

బంట్రో—సలామ్ దేఖో మహారాజ్. మాప్రభువైన హైదరుజంగు తమ కిమ్మని తాఖీదొసంగియున్నాఁడు. ఇదిగో (అని మంత్రి తాఖీదు నిచ్చుచున్నారు.)

మంత్రి—(చదివి చూచుకొని) రాజేంద్రా! హైదర్జంగుసాహేబుగారు మనలను దస్తు వసూలు చేసికొని జమాబందీనిమిత్తము రాజమహేంద్రవరము మకామునకు రమ్మని కమ్మవ్రాసిరి. ఇదేవర్తమానము.

రాజు—సరే! (ముఖవిలాసముతో) మంత్రివరా! ఇయ్యధికారము వీరి కెవ్వరొసఁగియున్నారు. మఱచిపోతిని జెప్పుము?



మంత్రి—రాజా! ఉత్తరసర్కార్లను 1752 వ వత్సరంబున దక్కనునవాబగు సాలబజ్జంగుగారు ఫరాసుసైన్యరక్షణకొరకు బుస్సీదొరవారి కొసంగియున్నారు. వెనుక ముజఫర్జంగుగారు డూప్లేదొరవారి కిచ్చినదేశముతోఁగూడనిప్పు డుత్తరమున గుండ్లకమ్మలగాయతు జగన్నాథమువఱకు నుండుదేశ మంతయుఁ బరాసువారి స్వాధీనమైనది. కనుక యింతటినుండి బుస్సీదొరవారు మనకు సర్వాధికారులు. హైదరుజంగుసాహేబుగారు వారిమంత్రులు.

రాజు—అవును జ్ఞాపకము వచ్చినది. (స్వగతము) మంచిసమయము సమకూడినది. కానిమ్ము. వారింగలసి యభిమతసిద్ధిం బడసెదము గాక! (ప్రకాశముగా) మంత్రివరా! వా రెప్పుడు వచ్చిరి?

మంత్రి—డిశంబరు నెల 19 వ తేదీని వారు రాజమహేంద్రవరముం బ్రవేశించియున్నారు.

రాజు—బంట్రోతులారా! ఎవ్వ రెవ్వరు వచ్చిరి?

బంట్రో—మహారాజా! ఫరాసుసర్వసహాధీశ్వరుఁ డగు బుస్సీదొరవారు వారిమంత్రియగు హైదర్జంగుసాహేబుగారు మహమ్మదు హుస్సేన్ లాడూఖాన్ సిద్దిబిలాల్ జానూఖాన్ హసనల్లీఖాన్ మొదలగు మేటిజోదులును వచ్చియున్నారు. ఇంక నాగోజీరాయాది ముసద్దీలు చాలామంది సిర్దీలును వచ్చియున్నారు.

రాజు—వీరికందఱకు బస దిగుటకుఁ దగినస్థలం బెచ్చట ననువుపఱచినదో?

బంట్రో—గోదావరీతటంబునఁ గోటిలింగపుణ్యక్షేత్రసామీప్యంబున గుడారంబుల నిర్మించుకొని విడిసియున్నారు మహాప్రభూ!

రాజు—వారు సేనాసహితంబుగ వచ్చినారా?

బంట్రో—మహారాజా! వారు చతురంగబలసమేతంబుగ వచ్చియున్నారు.

రాజు—ఏయే రాజులకుఁ దాఖీదుల నంపియున్నారు.

బంట్రో—శ్రీకాకుళపుసర్కారులోఁగల జమీదారులకందఱికిని దాఖీదులం జేసియున్నారు. మేము సత్వరంబుగఁ బోయి వారి కీతాఖీదులం జూపి బుస్సీ సందర్శనంబునకుం బోవలసియున్నది మాకు సెల వొసంగుఁడు.

రాజు—మంత్రివరా! ఈసాహేబులకుం దగినసత్కారంబులఁ జేసి పంపుము. మనము బుస్సీదర్శనమునకు వేగము పోవుదము.

మంత్రి—మంచిది రాజేంద్రా! అట్లే యొనర్తును. (అని వారికిఁ దగినబహుమతుల నొసఁగి పంపివేయుచున్నాఁడు.)

రాజు—సచివాగ్రణీ! మనప్రయాణంబునకుఁ దగినరథగజతురంగవ్రజంబు నాయత్తపఱుపుము. సేనలకుఁ బ్రయాణంబులు చెప్పి తగినయుద్యమంబున నుండఁబంపుము మఱియును దగినదినం బారసి చెప్పుము.

మంత్రి—నరేంద్రా! వార్షికవాసరంబు లరిగె. శరత్కాలంబు జరుగుచుండె. విజయనిమిత్తోత్సవంబుల నలరుచు రాజన్యులకు జన్యముల కరుగుకాలము కూడ సమకూడినది.

గీ. కొలఁకులెల్లను సంపూర్ణజలముచేత । నొప్పుచున్నవి తృణవృద్ధి మర్వియొసఁగు
చున్న దిప్పుడు రాజేంద్ర! యుద్ధసేన । లకు గజాళికి ననుఖముల్జరుగ నధిప!

కావున నేలికశుభప్రయాణంబున కెల్లి భవ్యదినము

రాజు—మంచిది మంత్రివరా! దుర్గరక్షణంబునకు నేర్పరైన నియమించితివా?

మంత్రి—నియమించితిని రాజేంద్రా! సమస్తంబు నాయత్తపఱచితిని.

రాజు—అట్లైన సరే! రేపు పయనమై పోవుదము.

(అని యందఱు నిష్క్రమించుచున్నారు.)



ప్రదేశము-రాజమహేంద్రవరములో హైదర్జంగు కచ్చేరి.

[బంట్రౌతులు ప్రవేశించుచున్నారు.]

బంట్రౌ—సలామ్ హైదర్జంగుమంత్రివరా! తాఖీదులను తమసెలవుప్రకారము శ్రీకాకుళముసర్కారులోఁగల జమీదార్ల కిచ్చి వచ్చినాము.

హైద—మంచిది పొండు. సభ్యులారా! పారావారంబు ఘూర్ణిల్లెడుతెఱంగు ననుకరించుచుధ్వని వినవచ్చెడిని. నాగోజీరాయప్రముఖులారా! మనపై సంగ్రామం బొనర్చుట కేరైన వచ్చుచున్నారేమో? (భటులతో)

క. కాండంబు నిండి భేరీ । డాంఢధ్వానంబు దిక్తటంబు లదిరఁగ ను
ద్దండత విన వచ్చె నరి । దం డెత్తుట యేమొ? తెలియఁదగు భటులారా!

నాగోజీరావుగారూ! అదేమో మీరేగి చూచిరండు.

నాగో—చిత్తము మంత్రివర్యా! ఇదె పోవుచున్నాను. (అని నాగోజీరావు పోవుచున్నాఁడు)

హైద—సిద్దిబిలాల్!

సిద్ది—జీ! సాహేబ్, మెహర్బాన్, సలామ్.

హైద—మీరందఱు మీమీసేనలతో సిద్ధముగా నున్నారా!



సిద్ది—తయార్ మహారాజ్!

హైద—మంచిది.

[నాగోజీ ప్రవేశించుచున్నాఁడు.]

నాగో—

సీ. చూచి వచ్చితి నరిసేన మూడ గాదు । నిమ్ము దర్శించుచుత్కంఠ మీఱి నృపులు
పటురయంబున వారిటు వచ్చుచున్న । వారలే గాని మఱియొండ్లు గారునమ్ము.

శా. సాహేబ్బా బ్విను! బూసిదర్శనసముత్సాహాగతక్షోణిభృ
ద్వ్యూహోదగ్రపటుప్రతాప విశదవ్యాధాయమానస్ఫుట
వ్యూహావిర్భవగర్జితారవలసద్వ్యగ్రిమ్యమాణాంక్యథ
క్కాహీనానకభీమవాద్యఘననిర్హ్రాదం బదే మ్రోగెడిన్.

హైద—మంచిది చమూపతులారా! మీస్థానంబుల కరుగుఁడు.

సిద్ది—జీ! సలామ్. (అని పోవుచున్నారు.)

హైద—(నాగోజీవంకఁ జూచి) రాజులన్న జ్ఞాపకము వచ్చుచున్నది. మనము తాఖీదులం బంపి నేటికి వారమురోజులైనదే. 28-వ తారీఖుకూడ వచ్చినది. ఇంకను రాజులు రాలేదా?

నాగో—

క. వచ్చిరి కొందఱు రాజులు । వచ్చుచు నున్నారు మిగులువారలు దూరం
బిచ్చటికి వారినెలవులు । కచ్చర రాఁ జాలమి కిదె కారణ మేమో?

హైద—వారిని నీవు చూచివావా?

నాగో—

క. రాజులనందఱఁ జూచితిఁ । దేజోవైభవము లెంతొ దీపింపఁ బురీ
రాజపథంబున రానే । రాజన్వతి మీఱి వారిఁబ్రజలు నుతింపన్.

క. చతురంగబలసమన్వితు । లతులితవైభవతిరస్కృతాఖండలు ల
ప్రతిహతబలబలభద్రులు । క్షితిపతు లొక్కొకరె వచ్చిచేరిరి నగరిన్.

హైద—ఆలాగా?

క. నీ వట్లు చెప్ప వాకున్ । భావంబున వేడు కయ్యెఁ బల్కుము వినఁగా
నా విభులవిశేషమ్ముల । నీ వెఱిఁగినకొలఁది వారి నెల్లెఱిఁగితివో!

నాగో—అట్లైన వినుము. మొదటఁ గళింగాధిపుఁడగు విజయరామరాజు నిజబాహుఖండా దండవిరాజిత విజయ గాండీవ సన్నిభకోదండుండై యువపంకల శంఖారావ

ములు దేవదత్తారవసన్నిభంబులు గాఁగ, నైరావతతిరస్కృతగజంబులు, నుచ్చైశ్శ్రవ సన్నిభంబు లగు వాజిరాజులును, నిరుపమానసంగ్రామకళాధౌరేయులంబోలిన సైనికనికాయంబులును బలిసి గాఁ దద్ధ్వని మిన్ను ముట్టి మాఱు మ్రోయ నొక్క పెల్లున నీరాజమహేంద్రవరపురంబుఁ బ్రవేశించె అదే కదా యాధ్వని మీరు నన్ను దెలిసికొని రమ్మంటిరి?

హైద—అదేనా యాధ్వని. అట్టివా రేమివారు?

నాగో—సుగంధివృత్తము. ఆకళింగభూమిజాని యద్భుతంపువైభవం
బేకడిందిఁ జెప్ప నేర్తు నేను మీకు ధీనిధీ !
యీనుభృద్బిడౌజమూర్తి యాత్మవర్గయుక్తుఁడై
వీఁక మీదుదర్శనంబు వేడ్కమీఱ వచ్చెడిన్.

హైద—ఇంక నెవ్వరు వచ్చిరి?

నాగో—మహాప్రభూ! కాకర్లపూడి వంశాంబుధి సోముఁడగు జగన్నాథరాయవరుండును స్వ్యవరపుర స్వామియగు రామభద్రరాజాగ్రణియును గాకెసతి క్ష్మాధవుండును జింతలపాటి నీలాద్రిరాయండును మఱికొందఱు నావిజయరామరాజు మ్రోలనే వచ్చిరి.

క. ఆరాజమౌళిఁ జూడఁగ । గౌరవమున మందపాటికలితకులజు లౌ
శ్రీరఘునాథాగ్రణియును । వీరుఁడు బలభద్రరాజు విచ్చేసి రొగిన్.

హైద—కళింగదేశాధీశ్వరుం డబ్బా యింతటివాఁ డేమి? ఎందఱినో తురుష్కావనీ పతుల నతులగతి నిలకించుచుంటిని గాని వీరిం బోలినవారి నెందేనిఁ జూచియుండలేదు. అందుచేతనే గదా శ్రీకాకుళపునాయబగు జాఫరల్లీఖాను పరాసుల నెదిరింపఁ గోరి యీరాజును సహాయము చేసికొనె?

[బుస్సీ ప్రవేశించుచున్నాఁడు]

(అందఱు లేచి సలాములఁ జేయుచున్నారు. వారియాజ్ఞనొంది యందఱు నాసీనులగుచున్నారు)

బుస్సీ—(శ్రవణ మభినయించి) హైదరుజంగుగారూ! ఆధ్వని యేమి?

హైద—నాగోజీరావుగారూ! ఆధ్వని కేమికారణము? చూచి రమ్ము.

నాగో—(తొంగి చూచి) మహాప్రభూ!

చ. నలువదివేలకాల్బలము నాలుగువేలహయంబు లెన్నొయే
నుఁగులు శతఘ్నికాచయముఁ గూడి ప్రభుత్వమహత్త్వఁ దెల్పఁగా



నలరుచు రాణ్మహేంద్రవరుఁ డాదట మాగధవార మెంతయుం
గొలుచుచుఁ గూడ రాఁగ నిదిగో చనుదెంచెడి మిమ్ముఁ జూడఁగన్.

[విజయరామరాజు ప్రవేశించుచున్నాఁడు]

విజ—బుస్సీగారూ! సలామ్. హైదరుగారూ! సలామ్.

హైద—(లేచి) సలామ్ రాజా! దయసేయుము. అని కుర్చీని జూపుచున్నాడు)

రాజు—ఆసీనుఁ డగుచున్నాఁడు.

హైద—రాజేంద్రా! సేమంబె?

విజ—మీయనుగ్రహమువలన క్షేమము మంత్రివర్యా!

గీ మీదుతాఖీదుఁ జూడఁగ నాగుడెంద । మధిక మానందమును బొంది యలఘుగతిని
మిమ్ము దర్శించువేడుక మించఁగా ని । చటికి వచ్చితి మయ్య నిస్తంద్రయశుఁడ.

హైద—మంచిది రాజాగ్రణీ! మీదర్శనంబుచే మాకును సంతస మయ్యె. మీ పరిపాలనావిశేషమ్మున జనుల కధికసుఖంబగుచున్నది గదా! అమాత్యభృత్య వర్గంబు మీయిష్టానుసారంబు ప్రవర్తిల్లునే?

విజ—మ. అరిదిం జూపరులు స్తనంగఁ బ్రజ లత్యంతంబు నాయాజ్ఞల
న్సొరది న్వే శిరసా వహింతుర్ సచివుల్ చోద్యంబుగా మద్వచ
స్సరణి న్జేయుదు రెల్లకార్యముల నశ్రాంతంబు భద్రంబు మీ
కరుణావేశము గల్గియుండుటఁ దురుష్కాగ్రామణీ ధీమణీ!

హై—రాజేంద్రా! మిగుల సంతసం బయ్యె.

(తెఱలోఁ గలకలము.)

నాగోజీరావుగారూ! ఆకలకలం బేమి?

నాగో—(తొంగి చూచి) మహాప్రభూ! మీసందర్శనంబునకుఁ దక్షిణ శ్రీకాకుళపు మహీపతు లరుగుదెంచుచున్నారు.

హైద—సేవకా! కుర్చీలు వేయుము.

సేవ—చిత్తము స్వామీ! (అని యట్లొనర్చుచున్నాఁడు.)

హైద—సేవకా! హుకాయి నిటు తెమ్ము.

సేవ—తెచ్చి యిచ్చుచున్నాడు.

హైద—పీల్చుచు వింత హాయి ననుభవించుచున్నాఁడు.

[రాజులు ప్రవేశించు చున్నారు.]

రాజు—సలామ్ బుస్సీవర్యా! హైదరుజంగుగారూ! సలామ్. విజయరామరాజుగారు తాజీ యిచ్చు చున్నారు.

నాగో—ఇటు కూర్చుండుఁడు. రాజవర్యులారా! (అని వారల నాసీనులం జేయు చున్నాఁడు.)

హైద—నాగోజీ! వచ్చినవా రెవరు? (అని కనుసైగ చేయు చున్నాఁడు.)

నాగో—

గీ. విను తురుష్కాగ్రగణ్య! యీవిశ్వవిభుఁడు । వత్సవాయాన్వవాయుండు మాయకేశ్వ
రానుజు ల్వీరు వీరు నారాయణేశ । కిమిడిరాజన్యపుంగవు లమితయశులు.

గీ. వీరు గొలుగొండవిశ్వభరారమణులు । సత్యవర రాజచంద్రుఁ డీసత్యఘనుఁడు
నీలభూధరరాయఁ డీనిర్మలుండు । కాశిపత్యభిధేయుఁ డీఘనయశుండు.

వీరు కాకర్లపూడి జగన్నాధరాయవరులు. వీరు మందపాటి వంశాంబుధిసోము లగు రఘునాధ బలభద్రరాజ పుంగవులు.

హైద—కుమావరులారా!

క. మాయానఁ బూని మీ రిట । కై యేతెంచుటకు మోద మందితి మింకన్
జేయుఁడు విహితోద్యమముల । నాయతభుజులార! మీరు లాయత్తపడన్.

విజ—చిత్తము.

బుస్సీ—హైదరుజంగుగారూ! వీరితోఁ మనకుఁ గలపనినంతయుఁ బూటపఱచి వీరికి సెలవుల నొసంగుఁడు.

హైద—మహాప్రసాదము స్వామీ!

బుస్సీ—భోజనసమయ మయినది సభ చాలించెదము.

(అందఱు నిష్క్రమించు చున్నారు.)

ప్రదేశము:—విజయరామరాజు బస.)

[రాజు, మంత్రి, నౌకరు మొదలగువారు ప్రవేశించు చున్నారు.]

రాజు—మంత్రివరా! మనగ్రామములవిషయమైన సంజాయిషీ దివాణమువారికిఁ దెల్పుటకు మనకు వకీలు ముఖ్యంబు గదా!

మంత్రి—అవును రాజేంద్రా! పిలిపించెదను. సేవకా! నీవు పోయి యొకవకీలును బిలుచుకొని రమ్ము.



సేవ—మహాప్రసాదము స్వామి! (అని పోయి వెంటఁగొని వచ్చు చున్నాఁడు.)

[వకీలు ప్రవేశించు చున్నాఁడు.]

మంత్రి—(చూచి) వకీలుగారూ! ఇటఁగూర్చుండుఁడు. (కుర్చీని జూపు చున్నాఁడు.)

వకీలు—ఆసీనుఁ డగు చున్నాఁడు.

మంత్రి—మీరు మా కొకరాజకార్యము సమకూర్ప వలె.

వకీలు—అట్లనే. మంత్రిగారూ దాని కేమి? సెలవింపు.

మంత్రి—

క. మీ రాతురుష్కవర్యు నా । జారముసం జేరి వచనచాతురి మెఱయన్
మా రాజకార్యము సవి । స్తారంబును దెల్పి సెలవు దగఁగొని రండీ

వకీలు—చిత్తము స్వామీ! ఆజ్ఞ చేసెదను.

మంత్రి—"ఎప్పటికిని మాకళింగకు మోతాదుగ జమాబందీ ద్వాదశలక్షల కేర్పాటున్నది. ఆసొమ్ములో సగ మిపుడును దక్షిణసగము మీఁద గోదావరిఁ దిరిగి వాటులోపుగ నియ్యఁ గలవార" మని చెప్పి రావలయు.

వకీలు—అట్లే మనవి చేసి వచ్చెదను.

రాజు—వకీలుగారూ! ఒకమాట.

క. మీతోఁ గొంతప్రసంగముఁ । బ్రీతి న్సలుపంగ నాకు వేడ్క యొ్యడి నేఁ
బ్రాతఃకాలను వచ్చెదఁ । జేతు న్మీయిష్ట మట్ల చెన్నలరారన్.

అని హైదరుజంగు సాహేబుగారితో నామాటగా మనవిఁ జేసి తిరుగ జవాబుఁ గొని రమ్ము.

వకీలు—చిత్తము. పోయి వచ్చెదను. (పోవు చున్నాఁడు.)

రాజు—(స్వగతము) నామనోగతం బగు నాలోచన నీమంత్రితోఁ జెప్పితినా వలదుడుగు మను నేమో? హైదరుజంగు తనతో రహస్యమున ముచ్చటించుటకు సమయ మొసంగకపోవునా? ఏలాగునసైన నీహైదరుజంగుం దోడ్కొని పోయి యీబొబ్బిలిగడీపై దింప వలె. (ప్రకాశముగా) మంత్రివరా! హైదరుజంగు మిగులమంచివాఁడుగాఁ గన్పట్టు చున్నాఁడు. అన్నిసంగతులు మనయిష్ట మట్లే యొనర్చును గా!

మంత్రి—మంచివాఁడుగనే చూపట్టెడిని రాజా!

రాజు—మన కిచ్చట నింక నెన్నిరోజులు పని యున్నది.

మంత్రి—మనవకీలు పనినంతయును సానుకూలపఱచుకొని వచ్చిన మన కింక నేమి పని యున్నది.

రాజు—మనము చెప్పినట్లు ఖాఁడీకొనునో లేదో?

మంత్రి—ఇయ్యకొన వచ్చును.

రాజు—

క. జాగయ్యె మనవకీ లట । వేగి మరలి రాఁడు మంత్రి! యే మిది? కార్యం
బేగతి సభలో నెఱపెడి । నో గద! తప్పింత గలుగకుండ మనయెడలన్.

మంత్రి—అటు చూచి మహాప్రభూ! వచ్చు చున్నాఁడు.

రాజు—ముఖము తేటగనే యున్నది. కార్యము సానుకూలపఱచుకొనియే వచ్చు చున్నట్లు గన్పట్టెడు.

[వకీలు ప్రవేశించు చున్నాఁడు.]

వకీలుగారూ! ఇట్లు దయచేయుఁడు. (కుర్చీ నిచ్చు చున్నాఁడు.)

వకీలు—కూర్చుండి సేద దీర్చుకొను చున్నాఁడు.

మంత్రి—మేఘవిలసితవృత్తము. రాజేంద్రా! చతురత మెయి యవనో
ర్వీజాని న్గని విశదపఱచి స
త్తేజస్స్ఫూర్తిని దెగువ మనవకీ
లాప్రిజదూర్ధిని రయముగ మఱలెన్.

రాజు—అవును నీవు చెప్పినది నిజమె. వకీలుగారూ! ఏమిసమాచారము?

వకీలు—రాజాగ్రణీ! దేవగణపరివేష్టితుం డగు దేవేంద్రునిపగిది నిఖిలరాజన్యపండిత లేఖకభృత్యనివహంబులో నక్షత్రమధ్యంబున నున్నదోషాకరుండువోలెఁ గూర్చుండి యున్న హైదరుజంగుం గాంచితిని.

రాజు—తరువాత.

వకీలు—

క. నే వేగఁ జని కళింగ । క్ష్మావిభుని వకీలు ననఁగ సన్మానంబు
న్గావించి నేను మారసి । నీవచ్చినకతముఁ దెల్పు నెయ్యుఁడ యనియెన్.

రాజు—తగినమర్యాద సల్పినాఁడు గద! తరువాత.

వకీలు—ముందుగఁ గళింగసర్కారుతోఁగల జమాబందీవిషయమైనసంగతులు, తర్వాతఁ దక్కినరాజకీయపద్ధతులనుగుఱించి వారడిగినవానికిఁ దగునుత్తరంబులు ముచ్చటించితిని.



రాజు—తరువాత.

వకీలు—

క. ద్వాదశలక్షలరూప్యము । లే దగ నెవ్వ డిచ్చు పన్ను, ఇందు సంగ బి
ష్ఠిఁ దలఁచితి మిఁకఁ గొదువను । గోదావరి దాటులోఁగఁ గూర్చుదు మంటిన్.

రాజు—హైదరే మనె.

వకీలు—వల్లె యనె. వారును శ్రీకాకుళము వచ్చు చున్నారు గాన నట్లనె యచ్చట నియ్య వచ్చు ననియె.

రాజు—సరే! ఇంతమట్టుకు బాగుగనే యున్నది. మంత్రివర్యా! వా రచ్చటికి వచ్చి మఱలిపోవునంతలో మనము సొమ్ము నియ్య లేమా?

మంత్రి—ఇవ్వ వచ్చును స్వామీ!

రాజు—తరువాత నా సంగతి యే మైనది.

వకీలు—తోదకవృత్తము. సలలిత మా గతి సాహెబుతోడం
బలికితి నే మృదుభాషల నాతోఁ
దెలిపినవార్తలఁ దెల్లముగా వాఁ
డలరి సరే యని యానతి నిచ్చెన్.

రాజు—

గీ. నీవె పో వకీల వనంగ నిముషయుగ్మ । మందు రాజకార్యంబునుఁ బొందుపఱచి
వచ్చితివి నీదుచతురత మెచ్చు వచ్చె । డిని నిశాంతంబునం దెల్లి పని వినియెదె?

వకీలు—అట్లే వచ్చెదను స్వామీ! ప్రస్తుతము సెలవుఁ గైకొనెదను.

రాజు—పోయి రమ్ము. (వకీ లరుగు చున్నాఁడు)

(అందఱును నిష్క్రమించు చున్నారు.)



ప్రదేశము:—హైదరుజంగు కచ్చేరీ.

[విజయరామరాజు మొదలగువారు ప్రవేశించు చున్నారు.]

రాజు—సలామ్ సాహెబుగారూ!

హైద—సలామ్. రండు కూర్చుండుఁడు.

రాజు—ఆసీనుఁ డగు చున్నాడు.

హైద—రాజేంద్రా! ఏమివిశేషములు?

రాజు—మీదర్శనముకంటె విశేషతర మైన వెవ్వి?

హైద—

గీ. మీవిషయపరిపాలనాకోవిదత్వ । మంత నిర్విశేషంబుగా నాలకించి
మీవిషయమై నుడివె బుస్సి మెచ్చుకొనుచు । మీవకీ లంతయుం జెప్పభూవరేణ్య.

రాజు—నాయందుఁ బరిపూర్ణానుగ్రహ ముండుటఁబట్టి మా క్షేమమారయుచుందురు.

హై—నిన్నటిరోజున మీ రేదోవర్తమాన మంపి యుంటిరే?

రాజు—సాహేబుగారూ! అవును.

క. పను లెల్ల ముగిసెఁ దగ మీ । పనుపున నిచ్చోట మాకు పడఁబడి పో మీ
యనుమతి పడయుటకంటె నిఁ । క నుపమసత్కీర్తిధుర్య! యధికం బున్నే?

హైద—రాజులందఱుఁ గలసిపోయెదరా యేమి?

రాజు—

క. ఈరాజమౌళులందఱు । నోరాజితకీర్తిధామ! యూరుదూరము నా
తో గారం దందుఁ బ్రియా । రంభమునందు మధ్య నాగెదరు సుమా.

క. అంతంబుపలకు వచ్చున । నంతో కంతుండు రాఁ డనంతయశోవి
క్రాంతా! యింతదనుక మీ । యంతికమున కదియు మీకు నవగతమె కదా?

హైద—వా రెవరు?

రాజు—వారా? బొబ్బిలిరాజుగారు.

హైద—ఎక్లెట్లా! రా లేదు గా! ఏమీ? ఎందుకు రా లేదు?

హైద—నాగోజీ! అందఱురాజులు జమాబందీ కరుగుదెంచిరా?

నాగో—బొబ్బిలివారు తప్పఁ దక్కినవారందఱు వచ్చియున్నారు. వారితోఁ గలపని సర్వము పూర్తియైనది.

హైద—బొబ్బిలివారు రా లే దని యేల మాతోఁ జెప్పలేదు.

నాగో—ఇఁక వత్తు రేమో?

క. ఇప్పుడె వచ్చునో తే కిం । కెప్పుడె వచ్చునో యటంచు నాత్మఁ దలఁచి నే
జెప్పక యుంటిని మీతోఁ । దప్పని మదిఁ దలఁపకుండఁ దగఁ బ్రార్థింతున్.

హైద—వారికి మాతాఖీదు పంపితివా?

నాగో—పంపియున్నాను మంత్రివరా!

హైద—మంచిది.

విజ—సాహేబుగారూ! ఎందుచేత రా లేదో నే నెఱుఁగుదును.

హైద—కారణ మేమొ జెప్పుఁడు.



రాజు—శ్రీకాకుళపుసర్కారులోఁ గలజమీందారులలో బొబ్బిలివారు తప్పఁ దక్కిన వారందరు నీదస్తులోనికి వచ్చి యున్నారు. వారు మాత్రము రా లేదు. వారు రారు.

హైద—ఏమికారణము?

రాజు—(తనలో) నా కిదే సమయము. బొబ్బిలిరాజు దివాణంబువారికంటె నెక్కుడు వాఁ డని చెప్పినం గాని యీతురుష్కాగ్రణికి నుగ్రమైనకిన్క పుట్టదు. వైరిరాజు నెక్కుడుగఁ జెప్పుట నాకుం దగినపని కాదు. అయిన నట్లు చెప్పినం గాని నా మంత్రంబు ఫలింపదు. కాని ఏమైనసరే. (ప్రకాశముగా) సాహేబుగారూ! పద్మనాయకశిఖామణియగు రావుకులాగ్రణి దుర్గ్రహచండదోర్దండప్రతాపప్రభూతగర్వావిలచేతస్కుండు గాన దివాణంబువారిని సరకుఁ గొనఁడు. వాఁ డెంత ధన్యుఁడో కాని యెంతటిఖాన్నిఘూలకుం జడియఁడు.

హైద—

గీ. సరకు జేయఁడె? కానిమ్ము తురకకత్తిదెబ్బ । చవిఁ గొనుం గాక భూరిప్రచండకాండ
దోఃప్రభానాగ్నికీలల దొమ్మి గాఁగ । బడి సమయునప్పుడే మత్ప్రభావ మెఱుఁగు.

రాజు—ఇంతే గాదు. శిస్తు వడ నీయఁడు. దస్తుఁ గానియ్యఁడు. నిజ మాడిన నిష్ఠురము. ఎందుకు?

హైద—ఏ మేమీ? యింక నెటువంటివాఁడు? ఇట్టిగర్వమునకుఁ గారణ మేమి?

రాజు—సాహేబుగారూ! ఆరాజు బహుపరాక్రమశాలి. అదే కారణము.

హైద—అంతపరాక్రమశాలి యేమి?

రాజు—శా. రంగారాయవరాపరార్జునుఁడు దోఃప్రావీణ్యమే పారి తా
రంగత్తుంగ దురాపగాండివనిభోగ్రప్రేష్ఠకోదండ మా
భంగప్రౌఢిమఁ దాల్చి ఘోరరణభూభాగంబున న్నిల్వఁగా
గంగానందనుఁ డైనఁ గావు మనుచుం గైచాపు లర్పింపఁడే?

ఇంతే గాక పాండవేయులభూజావిలంబును గార్తికేయునిపరాక్రమంబును విబుధాపగాసూనునిమహిమయు మహేశ్వరునిమహాత్మ్యమును విక్రమార్కునివీర్యాతిరేకంబును బరశురామునిపౌరుషంబును సంగ్రహించి విరించి మించి యీబొబ్బిలి వెలమదొరల నిర్మించె నని తోఁచుచున్నది.

మత్తకోకిల. రంగదున్నిజఖడ్గరాహువు రాజమండలి మ్రింగ ను
త్తుంగశౌర్యవిభావనుం డలవోర్బలాంకితమంబులం

భంగ పెట్టఁ దదాజ్ఞికూలము పౌఁజుసంద్రము నడ్డఁగా
సంగరంబున రంగరాయని సైఁచువా రెవ రుర్వరన్.

హైద — రాజా! ఈబొబ్బిలిరా జస్మదపారఘోరాభీలశతఘ్నీరావం బెఱుంగఁడు. ఈరాజులుగీజులు మదాగ్రహానలమునకు శలభమాత్రులు సుమా?

పంచచామరము. అరాతివీరవారమెల్ల నాకులంబుఁ బొంద మా
ఫిరంగి కాలుచిమ్ము వైరి వీరసైన్యవన్యముల్
దురంతరీతిఁ జుట్టుముట్ట దుర్మదంబు వీడి మా
పరాసుః కేనిశక్తియుక్తిపౌరుషం బెఱింగెడిన్.

రాజు — స్వామీ! అరిరాజన్యపుంగవహిరణ్యాక్షులు బొబ్బిల్యుర్వీధవమార్తాండసహస్రతేజోవిరాజన్నారసింహులకుఁ దృణప్రాయులు జుఁడీ మీ రె ట్లూహించుచుంటిరో?

హైద — విజయరామరాజుగారూ! మీది వట్టిపిచ్చియూహ. మాఫిరంగిమండలంబుల ఘుటికానికాయంబునకు సిఫహోసరదారుగా రంతటివారే కాందిశీకు లై పోవుచుండ నీబొబ్బిలిరాజన నెంతటివాఁడు?

గీ. తురకదొరలను మాతోడిడుములుసనేల? । భూమిఁ బ్రతుకంగఁ గలయిచ్చ వోడమియున్న
నస్మదాగ్రహవహ్నికీలాళియందుఁ । బడక యుండఁగ వలె సుమీ పార్థివేంద్ర!

రాజు — గాని యీబొబ్బిలిరాజన్యమూర్ధన్యులు చిన్నతనమునుండియు శౌర్యమే యుగ్గుగాఁ ద్రావింపఁబడి పెంపబడినవారు. కాన నే వారి కంతశౌర్యము,

హైద — మేము తక్కువవారమా?

సీ. క్షణమాత్రమునఁ గాదె జడిపించి విడిచితి మాళవచోళ నేపాళపతులఁ
నేరుదస్తుకుఁ గాదె జేర్చినవాఁడను శకసింధుఘూర్జరాశ్మంతపతులఁ
ఖయిదుఁ జేసితిఁ గాదె ఖాన్ బిరుదరుదార మరహాటకర్ణాటమత్స్యపతుల
శిక్షఁ జేసితిఁ గాదె శిలమేఁ పారంగ నాంధ్రబర్బరపుళిందాధిపతుల
వీరికంటెను బొబ్బిలివిభుఁడు ఘనుఁడె । దక్కనుపఠాణిసేన నుద్దండభీమ
భండనంబునఁ జెండాడు దండితురక । దొరల మగు మాకు హిందువు ల్బరమె? రాజ!

రాజు — సాహేబుగారూ! మీ కాగ్రహము వచ్చు నని జంకుచుంటిం గాని నా యూహలో రంగారాయనికిఁ జాలినరాజన్యగ్రామణు లెందునఁ గాన రారు.

గీ. అతనిఁ జేరిన తృణ మైన నతిఘనమ్ము । నమ్ముఁ డీమాట నిజముగ వమ్ము సేయ
రాదు రాజున కే గాదు రాజసమ్ము । జూడఁ దత్సేవకాళికిఁ గూడఁ గలదు.



ఇంతే గాక.

ఉ. బెబ్బులిమీస మైన వడి బెట్టియు నుయ్యెల లూగ వచ్చుఁ, బె
న్నిబ్బర మైన నెమ్మది ఫణిప్రభు కోఱల నూడ్ప వచ్చు, లో
నబ్బురపాటు జెంద నిసుమందునఁ దైలముఁ దీయ వచ్చు, న
బ్బొబ్బిలికోటపై విడిసి పోరఁగ రా దిల నెట్టివారికిన్.

హైద — ఇట్టిపిచ్చిప్రతాపంబు లేల వర్ణించుట? మాసంగతిఁ దెలిసి యుండియు మీ రిట్లు పలుక నేల?

రాజు — అయ్యా! మీరతనిఁ జూచినం గాని నమ్మఁజాలరు.

హైద —

గీ. ఏల వాగెద వాకోట నేల ఱేఁడ! । వారిశౌర్యాతిరేకంబు వారిమహిమ?
తెలిసియుండియు మావిభుతేజమల్ల । మాశతఘ్నుల వేగంబు మాబలంబు.

మాప్రభావం బాభూరమణునితోఁ జెప్పకపోతిరా?

రాజు — అతనిని బల్లకీ యెక్కి నాకోటచెంత నైనఁ బోనియ్యనే! వానితో నెటు మాట్లాడెదను?

హైద —

క. ఆరా జెప్పటి కైనను । మాఱాటము బూను మదిని మారాము మెయి
న్బోరా మి దేల నాకుం । బోరితమున వానిపొలుపుఁ బొలియింతు నొగిన్.

వాని నూరక పో నిత్తుమే? రంగారాయనిదోశ్శక్తియుఁ బరాసులజేని వీర్యాతిరేకంబుఁ జూతువు గాని.

రాజు — (తనలో) అదే నాయభీష్టము, వీనికిఁ గోపానలము హెచ్చుచున్నది. చల్లారకుండ నప్రియవాగాజ్యధారఁ గురియించితినా నాపని నెఱవేఱును. (ప్రకాశముగా) ఒకరంగారాయే యనుకొంటిరా? అతనితమ్ముఁ డన్నను మించినపరాక్రమశాలి సుమీ.

మత్తకోకిల. రంగరాయనితమ్ముఁ డెంతయు రంగదాహవకేళిలో
నింగి ముట్టఁగ సార్వఁగా నిని నిద్రికక్రమ మేర్పడన్
భంగపాటొదవంగ మీపటు పారసీకపుసైన్య మా
సంగరంబున నిల్వ నేర్చునె సాహసంబునఁ బోరఁగన్.

హైద — ఇదేమి వెఱ్ఱి?

క. బూసిసమానులు మీలో । బాసాడఁ గలరె? వారిబారాదిబలు
ల్లానూఖానుని యొక్కని । దాపలు వినినంతఁ గలఁడఁ బారరె చెప్పుమా.

గీ. ఇట్టిగర్వాతిరేకంబు నెదను బూని । మా కమానుష మొనరించెగా కలుష్క
మనదె మాయెద? జాతువు మాబలంబు । వానిబలమును బోరాడఁ బార్థివేంద్ర.

మహాస్రగ్ధర. దండిం ద ద్బొబ్బిలిక్ష్మాధవుల నిజభుజాదండకోదండనిర్య
చ్చండాభీలప్రకాండచ్ఛదనగుణఘృణీచండరుక్కాండపఙ్క్తిన్
ఖండాలం బేర్చి కాన న్గొరబడి తరుపు ల్పృక్కఁ జక్కాడురీతి
న్భండిం గావించి నైతు న్బిరుదు మగల బొబ్బిల్గడీ నుండకుండున్.

రాజా! మీ రిద్దఱేనా బొబ్బిలిలో నున్నవారు ?

రాజు—తురుష్కాగ్రణీ! ఇంతే కాదు. రంగరాయాగ్రణిచెలికాఁ డగుచెలికాని వెంకయ్యాప్రతాప మాధవధునిచెలికానిదోర్వీర్యంబును మట్టుపెట్ట నసుటను సందియము లేదు. అందఱిని మించినవాఁ డొక్కరుఁడు గలండు.

హైద—వానిపే రేమి?

రాజు—వానిపేరా? తాండ్రపాపయ్య. వాఁ డొక్కరుఁడు బొబ్బిలికోటఁ గాయఁ బెరవీరుం డచ్చటఁ గాలు మోపఁ గలఁడా?

క. ఈనురుల కాసించిన వా । యసమానప్రతాపవంతుఁ డగు నాతనితో
మసగుట పోర న్మామచు । మసలుటయే యేరి కైన మానిత మధిపా!

హైద—(వ్రేలుఁ గఱచుకొనుచు నాగ్రహముతో) లాడూఖాన్, హాసనల్లీఖాన్, లా, రాను మొదలగు మేటివీరులఁ జూచి యుంటిరి గాదా? వీరిలో వా రెన్నవవంతు?

రాజు—ఇంతటితో నే మైనది. దామరదమ్మన్న కాకర్లపూడి వెంకటరాజభూజానుల పరాక్రమం బావిష్కృచ్ఛవని కెఱుక. ఇం తెందుకు.

గీ. మంచితెమ్మ్ర లోకట హత్తించినట్లు । బొబ్బిలిగడీనిఁ జేర్చెఁ బో బెబ్బులితతి
దైవ మారయ వా రెంత ధన్యులొకొ । యహహా! బొబ్బిలియెంతపుణ్యంబు నేసె!

హైద—మీ రందఱును గర్విరనుగర్వము చేతనే కాఁబోలు మదాజ్ఞోల్లంఘనం బా రాజమూర్ఖుం డొనర్చె. అందులఫల మాతఁ డనుభవింపక మానునా? నీవును దుర్వారపరాక్రమశాలివే యని యందురే! ఏమియుఁ జేయ లేక యూరకుంటివా? అవెలను నీకంటె బలాఢ్యుండా కో?



రాజు—

క. వాఁ డెంత నాకుఁ దలఁపం । బోడిమి మెయి నిమిషమునను పొలియించెద నా
కోడిగము కాదు పూనికఁ । జూడు మిపుడె వానిపురము చూఱ గొనియెదన్.

దివాణమువారి కారా జొనర్చుదుష్కార్యములఁ జెవి వేయకుండ నేమియు నొనర్ప రాదని యూరకుంటిని. సెల విండు. అప్పైఁ జూడుఁడు. వాని నేమి సేతునో? దివాణమువారి నెదిరించిన దివాణమువారే దండింతురు. నీ కేలనని జనులు నన్నుఁ దూలనాడుదురు. కా నున్న నా కెంత. నాకు జడిసియే కదా నాకోటగుమ్మము నెదుర నడువ నోడును ?

హైద—అట్లయిన నాలావుఁ జూతువు గాని.

రాజు—ఏమి సేయ నెంచితిరి ?

హైద—గర్విష్ఠుఁ డై మాయాజ్ఞలను లక్ష్యము సేయక తనలావుఁ జూపింపనే కదా బొబ్బిలిరాజు ముత్తల్లి మ మ్మవమానపఱచె ?

క. హల్లా చేయుదు బొబ్బిలి । ఖిల్లాలోఁ గల్గుదొరలఁ గీర్తి వహింతున్
జిల్లా బొబ్బిలినూడని । యల్లా చరణంబు లాన యది నీ కీర్తిన్.

రాజు—ఆత్మను మిగుల హర్షించి (తనలో) నా పుణ్యము బాగుగ నున్నది. ఈతురకకుగ్ర మైనయాగ్రహముఁ దెప్పించితిని. వీరిమూలముగ బొబ్బిలికోట నాశంబు నొందించి యా రాజ్యము నాపరంబు గావింపఁగోరెదను. ఈతురకలు ధనకాంక్ష గలవారు. విశేషధనము నాసపెట్టితినా నా కీయుపకారముఁ దప్పక యొనర్తురు. (ప్రకాశముగా) యవనావతంసా !

క. అటు లైన నిత్తుఁ జూ వే । పటరభసముతోడ మీకు బాళి తుదంటన్
దటుకున లక్షలు పదిరెం । డట నా పెక్కియము నెత్త నలవఱచినచోన్.

హైద—మంచిది. ఆమాటలు నిలుపుకొనుము. (తనలో) ఈరాజు పన్నెండులక్షల నిత్తు నని వాగ్దాన మొనర్చుచున్నాఁడు. కానిమ్ము. ఆదేశము [illegible] కిచ్చెదను. (ప్రకాశముగా)

క. నీ కిచ్చెద నా రాజ్యము । ప్రాకటముగఁ దలను బువ్వ వాడక యుండన్
శ్రీకరుని జేతు నట గో । త్రాకాంతా! యనుము మగుడఁ దన [illegible]న్.

రాజు—రంగారావుని గెల్చి బొబ్బిలికి నన్నభిషిక్తునిఁ జేసిన మీకుఁ బండ్రెండు లక్షలు పాయనం బిత్తు.

హైద—మంచిది. నీయభీష్టానుసారంబుగ నిన్ను బొబ్బిలి కధికారునిగఁ జేతుఁ జూడుము.

రాజు—(సంతోషించి.)

మ. అలఘుప్రాభవశౌర్యశాలి వగుదీవ ల్లెంతయు న్నేయ నీ
కిలఁ దుల్యుండు గలండె ధైర్యమున నెఖిల్లాలఁ గన్గొన్న? నీ
తులువ న్గెల్చుట యెంత మీకుఁ దలఁప న్దండంబుచేఁ దుంగము
న్దల వీఁక న్బెకలించి వైచుమదభూదారంబు చందంబుగన్.

పారసీకాగ్రణీ! నీ వట్టివాఁడవే గాని వారు సామదానభేదోపాయంబులచే నజేయులు సుమీ. చతుర్థోపాయఁ బగుదండోపాయంబే కర్తవ్యము. దానిచేతం గాని సాధ్యులు గారు.

హైద—మమ్ము సరకుఁగొనక తిరస్కరించువానితో నా వాకు సామదానభేదోపాయంబులు. నే నన్నమాటఁ దప్పక జరిపి తీరువాఁడ నా సత్యసంధత నిరీక్షింతువు గాని.

రాజు—

గీ. పలికి బొంకరు మీవంటివారు భువిని. నిగ్రహానుగ్రహంబుల నెలవుపట్లు
మీరు తురక వజీర! మీమేటిగుణము । లెన్న వశమౌనె యావేల్పు మిన్న కైన?

అయిన నట్లు చేతు మని సమయం బొనరించుకొం టెందులకును మంచిది.

హైద—రాజా! సర్వదిఙ్మండలీవిభ్రాజితయశోధారేయుండ నగు నాయట్టివానికి రెండు నాల్కలు గల్గునా? అయిన నీవు కోరితివి గాన,

మత్తకోకిల. కత్తి ముట్టి చెప్పుచుంటిఁ గాన భీతిఁ దక్కు. మా
రిత్తమాట గాదు భూవరేణ్యా! నమ్ము మింక నీ
చిత్తమందు సంతసంబు జేర్పు మల్ల బొబ్బిలిన్
సొత్తు గాఁగఁ జేతు నీకుఁ జూడుమా లఘుక్రియన్

రాజు—(తనలో) నాకోర్కె సమకూరునట్లున్నది. బుస్సీ యే మనునో. (ప్రకాశముగా) హైదరుజంగుసాహేబుగారూ! బుస్సీ యొడంబడునా?

హైద—

క. మే మెంత చెప్ప నంతయు । భూమాన్యచరిత్ర! జరుగుఁ బోడిమి మీఱం
గా మంత్రులు సెప్పఁగ వినఁ । బో మనియెడినృపులు గలరె భూసలి నెందున్.

ఇప్పటినరపతులను జూచు చుంటిరి గదా? వారు గొప్పయుద్యోగస్థు లన్నమాటయే గాని వ్యవహారవ్యక్తత పూజ్యము. వారు కచ్చేరీమొగమే యెఱుంగరు. మే



మెంత చెప్పిన నంత జరుగఁ గలదు. వారు గారు ఖామందులు నేను. నీ కెందుకు ?

రాజు—సత్యము. ఇఁక నే ననుజ్ఞ వడయుదును గాక.

హైద—మంచిది పోయి రమ్ము.

రాజు—(తనలో) ఈసంగతిని బుస్సీతో హైదరుజం గీరేయి చెప్పును. అర్థకాంక్షఁ జేసి నాయుద్యమంబున కంగీకరించి యున్నవాఁడు. నేను ముందుగఁ బోయి పెద్దాపురమున నుండెదను. (ప్రకాశముగా) పారసీకాగ్రణీ! నాకీ రేయిఁ బెద్దాపురము పోవ సెల విండు.

హైద—అట్లనే చేయ వచ్చును.

రాజు—సలామ్.

హైద—సలామ్,

రాజు—(నిష్క్రమించు చున్నాఁడు.)

నాగో—అయ్యా! దొరవారు వచ్చు చున్నారు.

[బుస్సీ ప్రవేశించు చున్నాఁడు.]

హైద—(లేచి) సలామ్ దొరగారు.

బుస్సీ—మంత్రిపుంగవా! ఈమకామున జమాబందీ పూర్తియైనదా?

హైద—స్వామీ! విజయరామరాజాదిగా శ్రీకాకుళంబునం గలసమస్తదేశాధీశ్వరులు వచ్చి యున్నారు. వారతోడం గలకార్యము లన్నియు ముగిసినవి.

క. నీ వడుగుకతనఁ జెప్పం । గా వలసెను బొబ్బిలిభువికాంతుఁడు దక్కం
గా వసుధావరులందఱి । దే వచ్చిరి యాతఁ డెట్టిదిట్టఁడొ తలఁపన్.

బుస్సీ—అదేమి? కారణం బారసితివే ?

హైద—ఏ మని చెప్పుదును. ఈజమీందార్లలో బొబ్బిలిరాజు ప్రతాపసీర్యాతిరేకంబుల ఘనుం డఁట.

గీ. నిష్ఫలంబయ్యెఁ బాఖీదు నింద్య మయ్యెఁ । వానియభిమత మేఁ గంటివాఁడె సర్వ
భూమిఁ బాలించునఁట నింకఁ బూనికతోడఁ । జెలఁగి రాపాడిపోరితములను మనల.

బుస్సీ—ఏమీ! ఆ రాజున కిట్టిసామర్థ్యంబు కలదా?

చ. ఎఱుఁగఁడొ? రంగరావు నను నెల్లపరానుల ఱేఁడు బుస్సియం
చెఱుఁగఁడొ? మాపరాక్రమము లెంతయుఁ బాపక మూర్ఖు లంటి వాఁ

డెఱుఁగఁడో? మాశతఘ్నీజలభృన్నిచయోర్జితరావ మేర్పడన్
బరిగతధ్వాంతమీనినదప్రస్ఫుటితార్భటియాజి రాజిలన్.

హైద — మనబాహుశక్తిఁ దెలియకయే యిట్టివెఱ్ఱియూహం జేసి యున్నాఁడు.

బుస్సీ — మనయుద్యమం బాతనికిఁ దెలియఁ జెప్పిన వచ్చి మనపాదాక్రాంతుం డగు నేమో ?

హైద — ఆసందేహమును విడి పోయినది. తనవలె నే భుజపరాక్రమశాలు రగుతమ్ముఁడు లోనగు ననేకవీరులు చెంగట నుంటం జేసి సామాద్యుపాయంబుల వశుఁ డగు నట్లు లేదు.

గీ. నమ్మఁ గారాదు సుమి యిట్టినరపతులను । జేతు రెపుడైనఁ గూడనిచేత, లిపుడ
గరువ మడఁగించినం గాని కాల మరుగ । సాధ్యుఁడగునంచు నేనెంచ సామి! నిజము.

బుస్సీ —

గీ. హా! పరామల జూని కోపాగ్నియందు । నైవపేరిరేపణము చేత రావువంశ్య
శలభతతి మ్రగ్గఁగా నుండ జగతిలోన । నన్యథా యెట్లు జరుగఁగ నౌను చెపుమ.

ఇందుకు నీ వేమి యాలోచించితివి ?

హైద — నేనును సామదానభేదోపాయంబుల సాధ్య మగువఱకు రణముఁ దప్పింప నెంచితిని గాని వ్యవహారసరళి మీఁదుమిక్కిలిగ వచ్చినది.

క. మనదార్ఢ్యంబీవెలమలు । గనఁ జాలరు దిట్టతనము గల దంచును నే
రిని గాని జీరికిం గొన । రన వద్యచరిత్ర! మన్నెయధిపుల మనుచున్.

వీరును గేవలము దుర్బలులు గారు సుమా!

క. ఆమన్నినిం గన్గొన । భీమభయం బొదవు మదిని వీరతతికి నీ
సీమగలారికి నిక్కువ । మామన్నియపులి యటంచు నడరెద రధిపా.

వారు నిజముగ మనకుఁ జాలకున్న నితరులకు బెబ్బులివంటివా రనుటకు సందియము లేదు. వారిలోఁ దాండ్రపాపయ్య బహుబాహుబలశాలి యఁట.

బుస్సీ — ఆహా! ఇప్పుడేమి సేయుదము ? నిన్నడుగ నేల ? దండోపాయమె కర్తవ్యము. అది తప్పవే ఱే మున్నది? ఇట్టిగర్వగ్రంధులగంధ మడఁగించినం గాని మనకు క్షేమము లేదు.

హైద — విజయరామరాజు ద్వాదశలక్షలరూప్యంబుల బొబ్బిలిఁ దన కిచ్చిన నిత్తునని వాగ్దానము సేయు చున్నాఁడు. అట్లొనర్చిన నావీరుని గెల్చినవారమును బలవంతుని జేపట్టినవారము నగుదుము. ఇది యుక్తియుక్తముగ నుండు నేమో ?



బుస్సీ — చక్కఁగ నున్నది. పైగా ద్వాదశలక్షలరూప్యంబులు గూడ సమకూడె. హిందుస్థానములోనిపరాసుదొంతనము వారి కీసమయమున ధనముఁ గూర్చితిమా వారు బహుసంతసింతురు.

క. ద్వాదశలక్షలరూప్యధ । లోదయజయలక్ష్మి పలసి యూరక తను దా
నా దట వచ్చిన మాన మిఁకఁ । గా దని తోఁచియుఁ బురుషకారమె చెపుమా.

గనుక నీయాలోచన గణ్య మైనది.

హైద — నే నైన నిప్పుడే తొందర పడను సుమా. ముందు మకాముకైన వచ్చి సకారణముగ క్షమాపణఁ గోరిన విడుమువాఁడ నే.

బుస్సీ — అట్లు చేయఁ దగినదే. అయిన నింకొక యుత్తరువు నంపుము.

హైద — అప్పుడును రాకున్న నేమి సేయ వలె సెల విమ్ము ?

బుస్సీ — అట్లైన మన మనుకున్న దేమార్గము.

హైద — నాగోజీరావుగారూ !

హైద — ఇంకొకయాజ్ఞాపత్రికను వ్రాసి బొబ్బిలిరాజున కంపుము.

నాగో — అట్లనే చేసెదను స్వామీ! (అని వ్రాసి నౌకరుం జూచి) సేవకా! నీవు పోయి బొబ్బిలిరాజున కీపత్రిక నిచ్చి రమ్ము.

సేవ — చిత్తము. దేవరా! (అని పోవు చున్నాడు.)

హైద — బుస్సీగారూ!

గీ. విజయరామరా జగునిలవిజయరామ । రాజు సుమి రాజవరులలో రాజితుండు.

బుస్సీ —

నిజము హైదర ! నీమాట నే నెఱుఁగుదుఁ । బాదుసాతోడఁ బోరెడి పట్లు గాని.

హైద — హిందూరాజులలో మిక్కిలి యౌదార్యవంతుఁడును శౌర్యశాలియు బలవంతుఁడును.

బుస్సీ — నిజము. పిమ్మటిసంగతి యోజింపుఁడు. మేము పోయి వత్తుము. (అని నిష్క్రమించు చున్నాఁడు )

హైద — సేవకా!

సేవ — దేవరా! ఏమిసెలవు?

హైద — నీవు పోయి చమూపతిం దోడ్కొని రమ్ము.

సేవ — (పోయి వెంటఁ గొని వచ్చు చున్నాఁడు.)

చమూ — సలామ్ స్వామీ! యేమిసెలవు?

హైద — కొంతమందిసిపాయీల నంపి బొబ్బిలి పట్టిక్కు లారసి వీధులసంఘుగొందుల నెమకి జంగల్ ఝాడీమైదానంబులఁ గలయం గనుంగొని కోటత్రోవలఁ బరిక్షించి బురుజులసేనలఫిరంగులఁ జూచి కానలకోనలసీమల నవలోకించి వేగ రమ్మని చెప్పుము. పొమ్ము.

చమా — మహాప్రసాదము స్వామీ! ఆజ్ఞ యొనర్తును. (అని పోయి సిపాయీలఁ బంపు చున్నాఁడు.)

(అందఱు నిష్క్రమించు చున్నారు)





శ్రీ

# రంగారాయకదన సమవాకారము.

## ద్వితీయాంకము.

—౦ః౦ః౦—

ప్రదేశము — బొబ్బిలిలోని వీధి.

[వెంకటసోమయాజులు, రామశాస్త్రి ప్రవేశించు చున్నారు.]

వెంక — రామశాస్త్రీ! విశేషము లేమి? దివాణములో వివాహము లంట యెప్పుడు? నీవు వారిపురోహితకోటిలోనివాఁడవే గాన నీకుఁ దెలియక పోదు.

రామ — సోమయాజులు గారూ! ఈనెలలోనే ముహూర్త మేర్పరచినాము.

వెంక — శాస్త్రీ! ఇదిగో మహారాజవు, నామాట మఱచిపోకు సుమీ. ఈమధ్య యజ్ఞము చేసినాను నీ వెఱుఁగుదువుగా.

రామ — జన్న మొనరించితిరా? ఇం కేమి? కాని మన మదృష్టవంతులము గాము. ఈ వైవాహికములలో మనదరిద్రవిచ్ఛేద మగు ననుకొంటిని గాని దైవము వేఱుగాఁ దలంచు చున్నాఁడు.

వెంక — నీమాటలవలన నేదో యాటంకము గల్గినటులఁ దలంచెద. చెప్పుము.

రామ — ఇం కెందుకు. పుట్టెఁడాస పెట్టుకొన్నందుకు నిష్ఫల మైనది.

వెంక — నే నేరితోడను జెప్ప నదేమో సెల విమ్ము.

రామ — మనదేశాధిపతు లైనబుస్సీదొరవారు రాజమహేంద్రవరము వచ్చి జమీదార్ల కందఱకు వార్తల నంప నందఱికంటె ముందు విజయరామరాజుగారు రేఁగి పన్నెండు లక్షలు లంచ మిచ్చి బొబ్బిలికోటం దనకుఁ గలుపుకొనువిషయమై తగినయేర్పాటు హైదరుతోఁ జేసికొనె నఁట. మాపో రేపో వారంద ఱిటకు యుద్ధసన్నద్ధులై వచ్చు చున్నా రఁట.

క. కొండెములు సెప్పి మిక్కిలి । గండం డవి రాజు మిగులఁగార్పణ్యముతోఁ
దెండుకొని మొగము వారికి । గండునిరోధునిగఁ జేసెఁ గాదే నృపతిన్.

ఏమి చెప్పను? ఈమాట వినినప్పటినుండియు నా మనంబు స్థానంబు వాపె.

సోమ—

క. నిర్భాగ్యుల మనఁ దగుదుము । గీర్భాహూధవునివారిలు గేలి యొనర్పన్
దుర్భరము. మాడు మీరా । ట్స్వర్భూపతి కెట్టికేడు సమకూడినదో?

విజయరామరాజే యొనర్చెనా?

రామ—సమస్తబాంధవు లరుగుదెంచి యున్నారు. కోటలోఁ బెండిలిపనులు జరుగుచున్నవి. పురిజనులు సుత్సాహము మీఱి యున్నారు. ఇంతలో నింత పుట్టినది.

వెంక—మనరాజుగారీమధ్య రాజమహేంద్రపుర మేగెద రని విన్నామే. ఏల పోలేదు?

రామ—ఈరోజుననే బయలుదేర సైయుండఁగా నీవర్తమానము యాతాయాతపథికజనవ్రజంబుచేఁ జూచాయగఁ దెలిసి మనతేఁడు నాసికాగ్రంబునఁ గోనవేలు నునిచి యారా జొనర్చినయెగ్గం బహుభంగుల నుగ్గడించుచుఁ బ్రయాణంబు మానినాఁడఁట. నేను నాపాంథులవలననే వింటిని.

వెంక—అయితే కార్యము లాపుదల కావలసినవేనా?

రామ—

క. మునుమున్న పోరు సాగఁగ । గన నేట్లగు నీఁకను బెండ్లికార్యంబులు నే
నను కొంటి దైన్యమలు నని । మనభాగ్యము లిట్టు లుండ మఱి వే ఱెట్లొ.

వెంక—ఎన్ని పెండ్లింట్లు గాఁ దలఁచి యున్నవి?

రామ—అనేకము. అన్నియు వారివి వారిబంధువులవి.

వెంక—విజయరామరాజున కెట్టియపకార మొనర్చె మనరాజు?

రామ—మనరా జన్నా నాయన కెప్పుడు ననూయయే.

వెంక—ఇంతేనా కారణము?

రామ—

క. గిరినిర్ఝరముల నాఁనఁగ । బిరబిర మనవారు వారు బిరునుఁదనంబుం
బఱపిన, వారిని మట్టిరి । చురచుర మనఁబోలు రాజచూడామణికిన్.
వారిదేశమునుండి పాఱుకాల్వల వారడ్డము కట్టికొనఁ గూడదా?

రామ—ఇదివఱకు నాదినుండియు నూరకున్న హేతువుచేఁ దప్పటని సరి యైనది. ముందు సందిచ్చినఁబర్యాయంబున "నేను మేకై బిగియుదు" గదా.

వెంక—

గీ. తనకు మాలినదర్మంబు ఒగునె యెట్టి । పనుల మనకాల్వ లేమి? యామనుజుఁ డడ్డ
గింత యదియేల? యాభూమికాంతుఁ డెట్టి । కార్యమొగిఁజేసెఁగూడనికర్జమనక?



అటువంటివైరుధ్యము లున్నముఖాముఖీని బొత్తుపఱచుకొనవలెఁ గాని యిట్టిపని నాయారాజశేఖరుండు సేయ వలసినది? పరశ్రేయము నోర్వ వలదా?

రామ—సాధించుసాధనంబుఁ జింతించి చింతించి తుద కిట్టికార్య మాచరించె, కాని మేమేమి జరుగునో చూతము.

(అందఱు నిష్క్రమించు చున్నారు.)

పరిదేశము—బొబ్బిలిరాజు సభ.

[రంగారావు, బంధువులు, మంత్రులు, మిత్రులు, నౌకరులును ప్రవేశించు చున్నారు.]

రంగా—మంత్రులారా!

మంత్రి—మహాప్రసాదము స్వామీ!

రంగా—చారులు వచ్చిరా?

మంత్రి—ఇదె తమదర్శనమున కరుగుదెంచు చున్నారు రాజేంద్రా!

[చారులు ప్రవేశించు చున్నారు.]

చారు—జయజయమహారాజా! రాజకన్యానేకపసింహా! మహావైభవదేవేంద్రా! రావువంశలకశపాథోధిసంపూర్ణసుధాకిరణా! రంగారాయకుంభినీవల్లభా! పరాక్.

రంగా—వార్త లేమిరా?

చారు—మహారాజా! ఏ మని చెప్పుదును. నుడువుటకు నోరు రాకున్నది?

రంగా—నాకు నిప్పుడే తెలియ వచ్చినది. మీకుఁ దెలిసినది వాక్రువ్వుఁడు.

చారు—దేవా; సర్కారులభారంబు వహించి బుస్సీదొరవారును, వారిమంత్రిపుంగవులగు హైదరుజంగుగారును గడచినడిశంబరునెల 19-వ తేదీని రాజమహేంద్రవరంబుఁ బ్రవేశించి యున్నారు. అచ్చటికి విజయరామరాజాదిగాఁ గలసరపతులును వచ్చిరి. ఆరాచమిన్న హైదరుజంగుతో దేవరపైఁ గొండెములు సెప్పి యాఖానుద్దమకు బలవద్విరోధునిగఁ జేసె. అంతే గాక యాతనివలన 12 లక్షులలంచ మొంది బొబ్బిలికోట నిత్తు నని విజయరామరాజుతోఁ గత్తి ముట్టి హైదరు వాగ్దానముఁ జేసి యున్నాఁడు. వారందఱును బయలుదేరి మనకోటపై రేపో నేఁడో విడియ నై యున్నారు) ఇదియ రాజకార్యము.

రంగా—ఏ మీదురాగతము మంత్రులారా? మిత్రులారా! దీని నవలోకించితిరా? చారులారా! వారిప్పు డెచ్చట నున్నారు?

5

రంగా—మత్తకోకిల. పంతెనాస్వయవార్ధిచంద్రమ! భవ్యరాజవరేణ్య కా
ర్యాంతరంబులఁ దీర్ప వంచిత మైనవాఙ్నిపుణత్వ మం
దింత యంతని నిన్ను నే నుతియింప నేర్తునె సాటి గో
రంతయేనియు నీకు నిజ్జనులందు నెం దొకఁ డుండునే?

కాన నీ వేఁగి యానోరుందొరకును, వారిదుబాసీ యగు మద్దాల రెడ్డినాయనికి నీయుదంతం బాద్యంతంబు విశదపఱచి వీ రీయుద్యమంబు మానుటకుఁ దగినయుత్తరముల వ్రాయించి బుస్సీదొరంగారికిఁ జూపించి రమ్ము. నా కిదే యుపకారము.

బుచ్చె—

గీ. ఈశరీరంబు నీయది యీశ! యిట్లు । వేఁడఁగా నేల? మీపన్పుఁ బేర్మి జేయఁ
కంటెఁ బరికింప ముఖ్యమౌ కార్యమెద్ది? । పనివిసెదఁగాక రాజేంద్ర! పంపుమిపుడ.

రంగా—మిగులసంతసంబయ్యె బుచ్చెన్నా. అట్లయిన నీ కిదే యాజ్ఞ.
బుచ్చె—మంచిది రాజేంద్రా! ఇదే పోయి వచ్చెద. (అని నిష్క్రమించుచున్నాఁడు)
రంగా—మంత్రివరా! సైనికనికాయంబును దగినయుద్యమంబున నుండఁ బంపుము.
మంత్రి—చిత్తము స్వామీ!
రంగా—వెంగళ్రాయఁడా! చూచితివా? ఎంతజరిగినదో.
వెంగ—అన్నగారూ! కానిం డెట్లుజరుగునో చూతము.

[బంట్రోతులు ప్రవేశించుచున్నారు.]

బంట్రో—సలామ్. మహారాజ్. మాయేలిక యగుహైదరుజంగుసాహేబు తమ కిమ్మని లేఖ నిచ్చినారు. (అని యిచ్చుచున్నారు)
మంత్రి—(పుచ్చుకొని చదివి) రాజా! మనలఁ దక్షిణము వారివద్దను రమ్మని లేఖ వ్రాసిరి. ఇదియె వర్తమానము.
రంగా—మంత్రివరా! ఈబంట్రోతులకు బహుమతుల నొసఁగి పంపివేయుము.
మంత్రి—చిత్తము స్వామీ! (అని గుప్పెడురూపాయిలఁ దీసి యిచ్చుచున్నాఁడు.)
బంట్రో—సెలవు పుచ్చుకొనుచున్నారు.
రంగా—అమాత్యుఁడా! పత్రికధోరణి యెట్లున్నది?
మంత్రి—లేఖఁ జూపుచున్నాఁడు.
రంగా—(చూచి) నరసాగ్రణీ! ఈపత్రికఁ జూడుము. వ్రాఁతలోనే యింతదురాగ్రహము కన్పించుచున్నదే చూచిన నెట్లుండునో, ఏమైయిననుసరే పోవుదమా?



నరస—అంగడుదుడిపి యగురాజచ్చటఁ జేరి మనపైఁ గొండెములు సెప్పి ఖానుని మిగులనంకాపొంకము గలవానిగా నొనర్చె. అట్టివారిచెంగట కెట్లు బోవనేర్తుము. ఇంతేగాక.

గీ. ఖాను సర్వాధికారి నిష్కారణంబ । తిట్టినం దిట్టఁ గలవాఁడు ధీసమున
బూని పోయినఁ దొసఁగులు పుట్టు నేమొ । వైరిరాజుండుటం బట్టి వారికడను.

కాన నిచ్చటికి నొండుల ననిచి తెలుసుకొనుట మంచిది.

రంగా—అట్లైన నేరిని బంపుదము.

నరస—

క. భూమిప! బుచ్చెన కెన యీ । దామరదమ్మన్న గానఁ దగునీపనుపున్
సేమముగఁ జేయ నొరు లిల । భూమహితచరిత్ర! వీనిఁ బోలఁగలారే?

ఇదివఱకు బుచ్చెన్నను బంపియుంటిమి గాన నిప్పుడీయనం బంపుట యుక్తమని తోఁచెడిని. చెలికాని వెంకయ్యగారిని సహాయ మిచ్చుట మంచిది.

రంగా—అవును. చక్కఁగఁ జెప్పితివి. సేనకా! దమ్మన్న వెంకయ్యగార్లనుబిలువుము.
సేవ—మహాప్రసాదము రాజేంద్రా! (అని వెంటఁగొని వచ్చుచున్నాఁడు).
దమ్మన్న, వెంక—దేవా! ఏమి సెలవు?
రంగా—మీరు మా కొక్కయుపకార మొనర్ప వలెను.
దమ్మన్న, వెంక—అట్లు నుడువకుఁడు. మేము తమబిడ్డలము. తండ్రి తనయులని ట్లనునె?
రంగా—సరసాగ్రేసరులారా! మీ రేఁగి యీయుత్తరమును హైదరుజంగున కిచ్చినిష్కారణము వైర మూని వ్యళీకంబుల నాచరించుట పాటిగా దని వలసితిరేని యారాజిచ్చినవాని కినుమడుఁగులగజతంబు సమకూర్తుమని, కాదంటేరా మమ్ములఁ బోరనిచ్చి యాపైని జయ మందిన వారి కీనేల నిచ్చి యసంబుఁ బొందుమని యట్టియఁటమటకాఁడు నుడువుటకు టొంకుమాటలచే మనంబున గాంతాళంబుఁ బూని మాకు విప్రలంభ మొనర్పఁ జూచుటదెంతయు నన్నెకొండ్రపని గాని మీవంటివారికిఁ దగినది గా దనియుఁ జెప్పుడు. మఱియు దమ్మన్నగారూ!

గీ. న్యాయహీనంబుగా దివాణగిజువార । లిట్లు చేయుట దగవుకా దిరుదెఱఁగుల
వారి నొక్కసమముగ నిష్పక్షపాత । బుద్ధి వరయుట మే లని బోధ సెఱపు.

దమ్మన్న — } ఆ దెంతపని రాజాగ్రణీ! ఇదిగో పోయివచ్చెదము. (అని వెడలిపోవు
వెంక — } చున్నారు.)

(అందఱు నిష్క్రమించు చున్నారు.)

ప్రదేశము:—బందరు.

[గోరుందొర, మద్దాల రెడ్డినాయఁడు సేవకుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

గోరు—రెడ్డివరా! జమాబందికచ్చే రిప్పు డెచ్చట నున్నదో వర్తమానము వచ్చినదా?
రెడ్డి—రెండుమూఁడుదివసంబులలో ఖాసింకోటకుఁ బోవ నై యున్న దఁట.
గోరు—నా టచ్చటనుండి మరలి వత్తురా? లే కింకను ముందున కేగెదరో?
రెడ్డి—పైకిఁ బోవున ట్లే యున్నది. ఇంతటితో వెనుకకు వచ్చునట్లు లేదు.
గోరు—కారణ మేమి?
రెడ్డి—నాకును బోధ పడ కున్నది, దొరగారూ!
సేవ—స్వామీ! ఎవ్వరో తమదర్శనంబునకు వచ్చి యున్నారు.
గోరు—సేవకా! ఇటు దోడుకొని రమ్ము.
సేవ—చిత్తము దేవరా! (అని తీసుకొని వచ్చు చున్నాఁడు)

[బుచ్చెన్న ప్రవేశించు చున్నాఁడు.]

బుచ్చె—సలామ్ దొరగారూ!

గీ. నేను బొబ్బిలికార్యపీజాని రావు । వంశనీరధి రాజు గోపాలకృష్ణ
రంగరాయవరుం డంప రయము మీఱ । వచ్చిన వకీలనయ్య! నన్బుచ్చెనందుర్.

గోరు—అయ్యా! ఇటు కూర్చుండుము. (అని కుర్చీ చూపు చున్నాఁడు)
బుచ్చె—కూర్చుండు చున్నాఁడు.
గోరు—రంగారావు సుఖి యై యున్నాఁడే?
బుచ్చె—తమయక్షీణకటాక్షవీక్షణంబుల నింతవఱ కతిక్షేమంకరుఁడై యున్నవాఁడు స్వామీ!
గోరు—ఏమి యట్లనెదవు? కంఠంబునఁ బ్రాణంబు లుండఁగ వానికి నసుఖం బొనరించువారు గలరా? రెడ్డిగారూ!



క. ఆతనిధైర్య స్థైర్యము । లాతనిశౌర్యాతిరేక మారయ గణనా
తీతములు గావె రెడ్డీ! । యాతని నీ వెఱుఁగ వొక్కొ? యలఁతియె చెప్పుమా.

రెడ్డి—ఉ. ఆయతశౌర్యహేళి సుగుణాయుతశాలి యశోస్త్రశూలి వి
ద్యాయనపాళి సంచితమహాహవకేళి యరాతికీలి యా
ధీయుతరంగయన్నృపతి స్ఫుటవిక్రమ మెందు డాప నా
నాయునుతేజ మెవ్వరికి నైనను మాయ వశంబె తెల్పుమా.

గోరు—రెడ్డివరా! నీవు చెప్పినది బహుబాగుగ నున్నది. పంతెవవంశాగ్రణీ! నీరాకకుఁ గతంబేమి!

బుచ్చె—దొరగారూ! పరాసువతంసంబగు బుస్సీయను మంత్రిపుంగవుండగు హైదరుజంగును శ్రీకాకుళపుజమాబందీనిమిత్తమై యరుగుదెంచి విజయరామరాజు దురుపదేశంబున ద్వాదశలక్షల శుభ్రములకు భ్రమించి బొబ్బిలికోటం గొట్టి యారాచపట్టికిఁ గట్టిపెట్టు గట్టిపట్టున నున్నవారు. మారా జెట్టిదుష్కార్యంబు నాజ్ఞోల్లంఘనంబును వారికిఁ జేసి యుండలేదు. రంగరాయవిజయరామరాజక్ష్మావల్లభులకుఁ గలదీర్ఘవైషమ్యంబులు దమ రెఱుంగనివి గావు. అట్టియెడ నరివీరుని వెనుక నైచుకొని నిర్నిమిత్తంబుగ నిట్టియపకృతిని మారాజున కొనరించి దుర్యశోపంకిలంబునఁ బడ సుంకించుచున్నారు. ఇదియ వర్తమానము. మీతో జెప్పిరమ్మని రంగారావుగారు నన్నంపియున్నారు.

గోరు—ఆహా! (ముక్కుపై వ్రేలు నుంచుకొని) ఏ మీదురాగతము? ఆరాజు నీ తురకయుం గలసి రావుకులాగ్రణియగు రంగారావుపై కరుగుచున్నారా? ఎంత పని? రెడ్డివరా!

గీ. బుస్సియేమయ్యె నిస్సిరో భూధవులకు । నిందుసఖ్యంబుఁ జేయఁగా నేర్పు లేక
కొసరువిమతక్ష్మాధవుం గూడి రంగ । రావుపైఁ బోవ నిది యేటి రాజనీతి?

మరియును,

ఉ. మానితకీర్తివంతు లభిమానధనుల్ ధర రావువారు దు
ర్మానవమానభంజను లమానుషవిక్రము లట్టివారితో
నానెటిదండయాత్రిల నొనర్చుర? సంధియె లెస్స గాని య
మ్మానవనాధ హైదరులమాటనిచే నకై చేయు వచ్చునే?

రెడ్డి—మీరు సెలవిచ్చినది బహున్యాయపథము. అయిన నా రాజున కేమి కొదువ? అన్యులసొమ్ముల కాసించి యీముసలమానునకు మదంబునం గినుక వొడమ నెట్లతి కెనో గదా! ఆహా! యేమి యాతనితెలివి? ఇంతేగాక.

గీ. విజయరామోర్వీపున కెంతవెట్టిబుట్టెం । గొఱవిం జేపట్టి తలగోకికొన్నరీతి
రావువారలతోం బోరి రజవంశ । మెల్ల నడంగింప సమకట్టె నెట్టివింత?

గోరు—రెడ్డివరా! వెనుక సీరంగారాయకుమావల్లభుండును, విజయరామరాజుం దమ తమవైరుధ్యంబుల నిచ్చటికి వచ్చి నాకు నివేదింప వారికట్టినైరభావంబు తగదని వారి న్నివారించి కినుకల నణంచి మృదూక్తుల వారిం గారవించి యనిచినాండ. ఆరావువారిమహిమ నే నెఱుంగుదు. వారభిమానధనులు. చావం జంప వెఱచువారు గారు. అధర్మయుద్ధంబులకుం బోరు సుమా!

రెడ్డి—ఘరానునతంసమా! సత్యము. నేనును వారిసంగతి నెఱింగినవాండనే. గర్వితారాతి వీరవారకంఠతలుంఠననిర్గళితకీలాలప్రవాహ మజ్జనపవిత్రాత్మీణ దీక్షాపరాయణులు రావువారు వట్టివారా?

గోరు—రెడ్డిగారూ! సత్యము వాక్రుచ్చిరి. తమకావంతైన నపకార మెదం దలంచిన విమతులపైం దమదర్పంబులం జూపుటది యుత్తమమగు రాజనీతి. లోకులితరేతరవైమనస్యంబులం బూని కలహించునెడ నడ్డమువచ్చి కాచుటలు క్షత్రియ ధర్మంబులు.

గీ. వీరిపోరాటమున కేమి కారణంబు?

రెడ్డి— కలుగనే చూడు వారిద్ద అలమి కలనం
బోర న్యాయంబు జయమునందుం బుడమిలోన
వినమె "ధర్మోజయతి" యను వేదవాక్యు.

గోరు—

గీ. కాని బుస్సీకి నిదియేటి మానితంపు । నడత? యెన్నంగ విమతుని గడకుంజేర్చి
విదిత కకుబంత విశ్రాంత విమలకీర్తి । శాలితోం బోర సమకట్టె సాహసించి.

రెడ్డి—నిజము. దొరగారూ? మీకుం గోపమువచ్చునని జంకుచుంటిని గాని,

గీ తురకసరదారులాంటియా దుర్మదులిక । నర్థతృష్ణను నెవరిపై నైనం గాని
కినుక వహియించి తెగువలంగొనంగంజూతు । రయ్యొ!చనదిట్టియాయడికియ్యకొనంగ.



గోరు—ఔను గాని నేరమున్న నెట్టిక్రూరాత్ములైనను వంచనం జేయుట ప్రఖ్యాతి గాని నిరపరాధులగు నీరావువారలతోం బోరు టెంతమాత్రము నీతియైనపని గాదు. అదటుండనిమ్ము.

గీ. రాచవారంప వెస నీపరానువారు । రావువారిగడీమీంద రభసమునను
నడచినారను దుష్కీర్తి వొడమ కున్నె? । వారికే గాదు మాకు నవారితముగ.

రెడ్డి—బాగుగ నాలోచించితిరి. అట్టియపఖ్యాతి పుట్టక మానదు. జయించినను, జయింపకున్నను వారిశౌర్యగుణోపార్జితంబగు నఖండయశం బటుండనిమ్ము. నిష్కారణము పరాసులచేత నధర్మయుద్ధంబున నోడిరను నపఖ్యాతి మీమం జెందనైయున్నది. ఇది వారించుటే యుక్తము.

గోరు—ఏమిసేయును?

రెడ్డి—ఇట్లు చేయంగూడ దని సకారణంబున నొకజాబువ్రాసి బుస్సీకి నేరిచేతనైనం బంపుము. అది లెస్స

గోరు—అట్లే యొనర్తును.

బుచ్చె—చక్కంగం జెప్పితివి. నేను గోరెడిది యు నంతియ.

గోరు—అటులైన వ్రాతుంగాక. (అని వ్రాసి ముగించి) సేవకా! లూయిమర్టెనును బిలువ నంపుము.

సేవ—చిత్తము. (అని పిలుచుకొని వచ్చుచున్నాండు.)

[మర్టెక్ ప్రవేశించుచున్నాండు.]

మర్టెక్—సలామ్ దేవరా! ఏమిసెలవు?

గోరు—మర్టెనూ! నీవేగి యీయుత్తరమును బుస్సీ కిచ్చి రమ్ము. తక్షణము పొమ్ము.

రెడ్డి—మహాప్రభూ! తమరువ్రాసిన దీవకీలు గారు వినెదరంట చదివించెదరా!

గోరు—అట్లే చేయవచ్చును. మీరే చదివి వినిపింపుండు. (అని యిచ్చుచున్నాండు.)

రెడ్డి—బుచ్చెన్నగారూ! చదువుచున్నాను వినుండు.

బుచ్చె—ఏదీ! రెడ్డివర్యా! (సావధానముగ వినుచున్నాండు.)

రెడ్డి—ఉత్తరము. దండకము:—శ్రీరస్తు. మాన్షిరు! బుస్సీ! నరా! మిత్రా! మీ రాజమాబందిలోం జేయుప్రారంభము ల్దేట తెల్లంబుగా వింటి మాయావి యారాజు కొండెంబులం జెప్పి పడ్రెండులక్షల్ప్రమద్పింప మీమంత్రి హైదర్మది న్పంతసం బందుచుండ యుక్తమారీతి నాకువ్రాసిన్న మీ [illegible] చెప్పంగం జేసెన్గదా

వారిపై రావువారింతయుఁ ద్రోహముఁ జేయ లేదాయె మున్నెప్పుడా పూసపాట్వ్యయుల్ రావువారన్న లోవైరమే పూని యున్నారు. మీ రాధగాధీశుతోఁ గూడుట ల్యాయ్యమే? రావువారెన్న సద్ధైర్యమంధాదుర్లక్షోట వారిప్డు మిమ్మారకేపోవ నీరాజీఁ బైపెచ్చు దుష్కీర్తిపాలౌదు మా రాజుతోఁ గూడి విధ్వంసము జేసిరా? పోల మీఘాత్రింనువా, రన్నెకాండ్రించుఁ, దప్పున్న దండించుట ల్యుక్తమే గాని నిష్టులౌ వారితోఁ బోర భావ్యంబు గాదెంచగాఁ జాలియుం దేరిసఖ్యంబు గావింపు మా వారికిన్ లేదో పోరంగ ని మ్మిద్దతిన్ ముస్లమానాత్రిజాలూహింప సద్ధర్మము న్యీడి రీపట్ల సత్యంబు ను మ్మింతయున్ వీరు సెప్పంగ వింటేమియున్ లెస్సగా దింక నీయుద్యమం బాత్మఁ దోరియంగ మేల్ వారలత్యంత రోషాగ్ని నేత్రుల్ పరితాపాగ్నిహోత్రుల్ స్ఫురదివ్యగాత్రుల్ జగద్వ్యాప్తకీర్తుల్ పరిభ్రామితశ్రీస్తుల్ భవత్ప్రేమపాత్రుల్ సుది నమ్ము.

మిల్లెంతయు స్నేహముచున్నట్టి,
మిత్రుండ,
గోరుందొరన్.

హాలు మకాము బందర్,
7-1-1757.

బుచ్చె—అంతే నాకుఁ గావలసినది. చక్కఁగ నున్నది. రెడ్డివరా! ఆపైని దైవగతి యెట్లున్నదో యట్లు జరుగక మానదు.

గోరు—లానూ! నీ వీవకీలుతోఁ బోయి బుస్సీగారికి దీనిఁ జూపించి రమ్ము.

లాను—స్వామీ! ఆజ్ఞఁగొనెదను. (అని వెళ్ళిపోవుచున్నాఁడు.)

బుచ్చె—(సెలవుఁగైకొని వానివెంటనే పోవుచున్నాఁడు.)

—

ప్రదేశము—ఖాసింకోట.

[బుస్సీ కచ్చేరీ.]

బుస్సీ—మంత్రివరా! రాజకార్యము లెట్లున్నవి? బొబ్బిలిరాజు పెద్దాపురమైన వచ్చియుండెనా?

హైద—పరానువంశాగ్రణీ! ఏల వచ్చును.

బుస్సీ—భళీ! ఈమకామునకైన వచ్చునా?

హైద—

గీ. అట్టిసరనుఁడు గాఁడిప్పుడైన రాన। ధిపుఁడ! మన్నింప నర్హుఁడే తీవ్రరోష
మైదినుఘటియించిరాఁడయ్యె మేదినీవిభుఁ। దయ్య!యింక నేమిసేయఁగావలెనొకో.



బుస్సీ—ఎంతపెంకెవాఁడు రంగారావు?

సేవ—స్వామీ! బందరునుంచి లానూమర్టెన్ వచ్చె.

బుస్సీ—సేవకా! వెంటనే రప్పింపుము.

సేవ—(పోయి వెంటఁబెట్టుకొని వచ్చుచున్నాఁడు)

[మర్టెన్, బుచ్చెన్న ప్రవేశించుచున్నారు.]

మర్టెన్—సలామ్ పరానుకులావతంసా! బుచ్చెన్న—సలామ్ స్వామీ!

బుస్సీ—ఇటు కూర్చుండుఁడు.

మర్టెన్—బుచ్చెన్న నాసీనుం జేసి తానును గూర్చుండుచున్నాఁడు.

బుస్సీ—మర్టెన్! గోరుందొరవారు సుఖులే?

మర్టెన్—సేమము దొరగారూ!

బుస్సీ—నీరాకకుఁ గతంబేమి?

మర్టెన్—మీ కిమ్మని గోరుందొరవారు జాబునిచ్చియున్నారు. (ఇదిగో యని యిచ్చుచున్నాఁడు.)

బుస్సీ—తిరిగి తిరిగి చదివి చూచుకొని.

గీ. ఎంతవాఁడవు హైదర యిట్లుచేయఁ। దగవె? యీపట్ల నమ్మంగఁదగునె నిన్ను?

హైద—

ఏమి యిట్లంటి రయ్యా? నే నేమి సేసి। నాఁడ నపకార్యములు వేగ నాడ రయ్యా.

బుస్సీ—ఇంక నకృత్యమే మను మున్నావా? ఇప్పుడొనరించినది కాదే?

హైద—ఖిన్నుండై తల వంచుచున్నాఁడు.

బుస్సీ—మనస్నేహితుఁడును వయోబుద్ధి సామర్థ్యంబుల నెక్కువవాఁడును ధైర్యమందరుండు నగుగోరుందొర వ్రాసినజాబు వినుము. (అని చదివి వినిపించుచున్నాఁడు.)

హైద—(తనలో మాగుట్టు తెలిసినది. ఈపట్ల ధైర్యము వదలుట తగవు గాదు. అయిన దేమో యైనది. సమర్థించి గెల్చుట శక్తికా నిమ్ము. నా తెల్వినంతయు నుపయోగించెదనుగాక)

బుస్సీ—ఛీ! నీమాట విని నేనుం జెడిపోతిని.

హైద—అట్లు సెలవొసంగకుఁడు. తమ కాగ్రహము వచ్చినది. ఇప్పుడేమియు ననఁజనదు. నిజము పల్కిన నప్రియముగఁ దోఁచు. ఆగ్రహస్వభావం బట్టిదియె కదా?

బుస్సీ—ఇంక నేమి చెప్పవలసి యున్నది? తలఁచినదాని నిదివఱకే చెప్పి యుంటివి గదా?

హైద—

క. నుడివితి నేబద్ధుల? నే । గడుసుందరం బలరఁ బనులఁ గావించితి నే?
యొడయనియానతి లేనిది । బుడిబుడి నన్నిట్లు పల్కఁ బోలునె? యధిపా!

అఖండధరాభారం బూని కార్యనిర్వాహకత్వంబున మీ కావంతయు నొప్పిదగులనీక చిరకాలంబునుండి యమాత్యకృత్యంబు నిర్వర్తించుచుండ ప్పున నేమెఱుంగక కాలంబు గడుపుచుంటిం గదా! నేఁటి కిట్టిది పుట్టె.

బుస్సీ—అపవాద గలుగుకాలము సంభవించినది!

హైద—కడుదూరంబునం గలగోరుందొర కీశ్రీకాకుళమువృత్తాంతము తెలియవచ్చిన దఁట! ఇచ్చటఁ బని సేయుచున్న మన మవ్యక్తుల మఁట.

క. మన మొనరించెడుపనులకు ! జను లొం డ్లభ్యంతరముల సరవిని బెట్టన్
మనయధికారము చెల్లునె? । జననాయక! యగడుగాక జగతిని నెందున్.

బుస్సీ—అది నిజమే గాని రంగారావును మన్నన సేయుటక్షియుక్తం బనియును విజయరామరాజు దితకోధబద్ధుం డై యోర్వఁ జేయుకుయుక్తి నీదప్రబుద్ధుండం బనియు మన కిట్టియుద్ధంబులఁ బ్రవర్తిల్లుట యపకీర్తి యనియును వ్రాసియున్నాఁడు గదా. అతనిహితోక్తి ముచ్చ వచ్చు

చ. హితుఁ డనుజన్మసన్నిభుఁ డహీనగుణార్జవకీర్తిశాలి సం
తతతము మదీయగౌరవనిధానము కెట్టనుగోరు వాని దౌ
హిత మొనరించు టెంతయును హెచ్చటు చేయక యున్న నాపయిన్
మతి నలుక ల్జనించును సమాహితసైన్యవిభుత్వవర్తికిన్.

హైద—అ ట్లైనఁ దమయిష్టము వచ్చినట్లే చేయ వచ్చును.

బుస్సీ—మన కీఁక బొబ్బిలి కేగఁ బని లేదు. శ్రీకాకుళముమీఁదుగ మనరాజధానిఁ జేరుదము.

హైద—గోరుందొర వ్రాసినంతమాత్రమున మనప్రయత్నంబు మాని పోవలసి యున్నది. అధికారులయెడలఁ దాబేదారు లొనరించునక్రమంబులు సహింత మీ రోర్తురు గాని మావంటితురకబిడ్డల మోర్వఁ జాలము.

బుస్సీ—ఏ మ ట్లంటివి?



హైద—

గీ. ధీరు లన్నను వారె పో ధీమసమున । ఖాన్నిఘూలను ఖాతరు గైకొనకను
జంకు బొందరు మదిలోనఁ బంక మూని । యట్లు సేయఁకలారె? యేయన్యనృపులు?

తెలియుచునే యుండఁగా వేఱు సెప్ప నేల? జమాబందికి రమ్మని యుత్తరువుఁ జేయ లక్ష్యము సేయరైరి. పో నిమ్ము. దివాణమువారిప్రాంతముల నిరుదెంచి చాలాకాల మైనను దర్శన మైనఁ జేసి పోరైరి. పైగా మన మన్యాయము గావించుచుంటిమని బందరులోఁ ఓతూరీ చేసిరి.

బుస్సీ—అవును. నీవు నుడివినదియును సబబుగానే యున్నది.

హైద—

గీ. రాజు నేనను బహుళదుర్మార్గుల మఁట । బొబ్బిలివిభుండుమాత్రమె బుద్ధిమంతుఁ
డఁట విశేషధనము గొని యట్టిటక్కు । లాడు నా రెడ్డిమాటలఁ బాడి గలదె?

క. ఆరెడ్డినాయకుం డిదె । యారంగారాయనృపతి యద్భుతగుణవి
స్ఫారుం డని యెటు దెల్పెనొ? । గోరుందొరగారితోడఁ గూరిమి పుట్టన్.

బుస్సీ—ఆరెడ్డి లంచము దిను నేమి? కాన నే చక్కఁగ నతుకునట్లు చెప్పి మనల నదలను దూలనాడించె. కా కున్న సర్వాధికారిని నే నుండ గోరుందొర కేమి? శ్రీకాకుళమువ్యవహార మేమి?

మర్తెక—తమ రట్లాలోచన సేయఁ జనదు. ఈవిషయమై సైన్యాక్షుని కందఱికంటె నెక్కుడు దెలియు ననుటకు సందియము లేదు.

హైద—ఎఱుఁగుదు ననిసం గాని మననోరు మూయుట కవకాశము లేదు. ఏమెఱుఁగుదురు? దేశముపై సర్వాధికార మూని వచ్చి పని చేయుచున్న మా కింక నీమనుష్యులయానుపానులు బోధపడ లేదు గాని సౌధాంతరంబున హుక్కా పీల్చుచుఁ బ్రొద్దెఱుంగక పోతుటీగ కైనఁ జొర రానిఘారాలోనుండి తనయొడలే తా నెఱుంగని గోరుందొరగారికిఁ దెలియు నఁట. మనకుఁ దెలియ దఁట. ఎంత పిచ్చిమాట.

బుస్సీ—అవును. లాలోచీపనిగానే కనుపించుచున్నది.

గీ. నిజము నీమాట హైదర! నేల యేఁడు । బహుళదుర్వారగర్వసంప్రాప్తవైర
భావ మెడఁ బూని యున్నాఁడు వానిగర్వ । మడఁపఁ గావలె నెట్లైన నాగఁజనదు

మర్తెక—పరానువంశాగ్రిణీ! మీధీనచివునయాలోచన నీపట్లు వినఁ బాడి గాదు.

హైద—మీరెడ్డినాయఁడు మెచ్చకున్న మాకుఁ జెడునది లేదు.
మర్టైన్—ఒకరి కొక్కనివలనఁ గీర్త్యపకీర్తులు చెందఁ గారణ మగును.
హైద—ఆలోచించి మాట్లాడుము. లేకున్న నీగౌరవ ముంచువాఁడను గాను
మర్టైన్—నీ కేమి. యశం బపయశం బాయనవి గాని.
హైద—ఎవ్వరికి నపకీర్తి రానీయకుండ నీ వుంటివి చాలదా:
బుచ్చె—"అధికారాంతమునందుఁ జూడవలదా యాయయ్యసౌభాగ్యము" లన్న ట్లిప్పుడు తెలియదు. తరువాత మీరే యనుభవింతురు. మేము పోయి వచ్చెదము. బుస్సీదొరగారూ!
బుస్సీ—మంచిది.

[మర్టైను, బుచ్చెన్న వెడలి నిజనివాసంబుల కరుగుచున్నారు.]

హైద—బుస్సీదొరగారూ!
క. ఏ కపకారముఁ దలఁతునె? । యాకార్యపి వాధుచెయ్వు లవి సరి యగునే?
యాకరము గొనరె దొర లిల । నీకైవడిఁ బనులు సేయ నెచ్చట నైనన్?
ఆరా జొనర్చినది సరియేనా? మనకు వీరితోఁ గలపని కై యన్నిరోజులు కనిపెట్టుకొని యుండవలెనుఁ మనయం దింతపాటిగౌరవ మైన నుంచకున్న మనయుద్యోగము లేల? తాఖీదు నైనను లెక్క సేయనిచోట నుద్యోగము చేయుటకంటె హైన్యము లేదు.
గీ. ఛీ! సఘాలేనినౌకరీ చేయుకంటె । నుడుగుటది మేలు చూడ నీయుర్వియందు
నధిపుగౌరవమొందనియపుడుకొల్వుఁ । గొలుచుకంటెను మడిదున్ని కొనుట మేలు.
ఇదిగో! మీ మొహరు. నా కీయుద్యోగ మక్కఱ లేదు. (అని బుస్సీకాళ్లవద్దఁ బాఱవేయుచున్నాఁడు.)
బుస్సీ—సచివాగ్రణీ! తొందరపడకుము. గోయందొరవారిధోరణి నీతోఁ జెప్పితింగాని నీవు సేయుపని తప్పని యంటినా? నీయిష్టము వచ్చిన ట్లొనరింపుము.

[సైనికులు ప్రవేశించుచున్నారు.]

సైని—మహాప్రభూ! చచ్చిపోతిమి.
హైద—ఏ మది? ఏ మది?
సైని—మహారాజా! తమ రంపఁగ నేఁగి సమస్తముం గలయఁ జూచుచుండ వారి ప్రదేశమం దొంతువనంబునఁ గొంతసేన హఠాత్తుగ మామీఁదఁ బడి నలువది



మందిని హతులం జేసె. కొంతమంది కాయంబులు గాయంబులు గాఁగఁ బలాయను లైరి. మిగిలినవారల మీవార్త మీకుం జెప్పఁ బఱతెంచి వచ్చినారము.
హైద—దొరగారూ! చూచితిరి గదా యారాజు చేసినపని? సైనికనికాయంబుల కాయంబులు గాయంబులు చేయుటయే గాక కొంతమంది ఫరాసుల బరాసులఁ జేసి కటా సైఁచెదరా!
బుస్సీ—అవన మెవరికి?
హైద—బొబ్బిలిరాజుది. సందియ మేల? విజయరామరాజిట మనవద్దనే యుండి యున్నాఁడు గదా!
బుస్సీ—అబ్బా! ఎంతపని జరిగినది! నలువదిమందిని జంపించెఁ గా! వీనిపొగ రడఁప వలసినదే. ఇఁక జాలిఁ దలఁప రాదు.
హైద—ఎంతక్రూరకార్య మొనరించెనో చూచితిరా?
బుస్సీ—అవును. ఇట్టిదుర్మార్గుని నేమిచేసినను జేయ వచ్చును. నేను బోవుచున్నాడ (అని నిష్క్రమించుచున్నాఁడు.)
హైద—సైనికులారా! నే నాసంగతిఁ గనుగొనెద. మీరు భీతి దక్కి యుండుఁడు. (సైనికులు నిష్క్రమించుచున్నారు.)
సేవ—స్వామీ! ఎవ్వరో తమదర్శనంబునకు వచ్చి యున్నారు.
హైద—(కోపముతో) రప్పింపుము.

[దమ్మన్న, వెంకయ్య ప్రవేశించుచున్నారు.]

దమ్మ—వెంకయ్యా! ధూమ్రాక్షు, విరూపాక్షాదిరాక్షసవీరాకృతి గలయీపాశ్చాత్యుండే గాబోలు హైదరుజంగు? ఊరక నే కన్నులనుండి క్రోధాగ్నికీలావిస్ఫులింగంబు లెగయు నిట్టివీనితో నెట్లు పలికి సమాధానంబులఁ గొనవగు?
వెంక—
గీ. వీనిఁ జూడంగ భయ ముద్భవిల్లు చునికి । యమునితో మాటలాడుట యని దలంతు
వీనితో నాడ నైనను వీఁడు మనల । నేమి సేయు నుడువుదము సామరీతి.
దమ్మ—కానిమ్ము. ముందు నేనే మాట్లాడెదను. సలామ్ సాహెబ్ మెహర్బాన్! బొబ్బిలినుంచి వచ్చినవకీళ్లము. దమ్మన్న, వెంకయ్య యను పేళ్లు గలవారము.
హైద—మా సేనం జంపించెను గా మీ రాజు? జాగ్రత్త.
శా. ఏలా గాఁచు భవత్ప్రభుండు మదిలో నే మంచు భావించెనో!
జ్వాలోత్తీక్షణ మత్ప్రతాపహుతభుక్చండస్ఫులింగార్చిటెన్

ఖాలీ చేయించఁ గోటఁ బొమ్మనుచు మీఖామందుతోఁ దెల్పు పో
వేళాకోళమె ఖాన్నిఘా లిల హుసేన్వీరాదిసంబాధముల్.

దమ్మ—స్వామీ! కొంచెము శాంతింపుఁడు. తమ్మునే దైవముగాఁ దలంచుచు రంగా రావుగారు మీ కెట్టియపకారమును జేసినవారు గారు. కోట వదలి వెళ్ళి పొమ్మను టేటిసబబు?

హైద—ఎట్టిసబబా? కోట వెడలఁగొట్టి చెప్పెదను.

దమ్మ—అంత నేర మేమి చేసినాము? తురుష్కాగ్రణీ! తమదయకుఁ బాత్రులము.

హైద—మా సైనికులఁ జంపుట కేమిదురాగతము? (అని కత్తితో జళిపించుచున్నాఁడు.)

దమ్మ—

గీ. ఇట్టిపని నెన్నఁడును జేసి యెఱుఁగ మయ్య। వారు లాడుట మేలె మీపాదమాన
వైరిరాజిట్లు సేసి మావారిపైని। ద్రోసెనో గాని మీకిట్లు దోఁచఁ దగునె?

మీ సైనికుల కంటఁ జూడ నైన లేదు. మా రాజట్టితో ప్రవలబోవువాఁడు గాఁడు.

హైద—మేమా యట్టితో ప్రవలఁ బోవువారము? (పండ్లు పటపటఁగొరుకుచున్నాఁడు.)

దమ్మ—

గీ. నిరపరాధుల మమ్మిట్లు నిందపాలు। పఱుపఁ గారాదు మీవంటివారి లహిత
రాజుపలుకుల కలుకూని రాయిడించి। పక్షపాతంబుఁ బూనుట పాటి యగునె?

హైద—మాయాగ్రహముసంగతి నీ కేందుకు? మాయెడల వంతభయభక్తియుక్తులుగా?

దమ్మ—ఉ. రా దొకయింత యైన నపరాధము మీయెడ నాచరింపఁగా
మీ దగుదర్శనంబునకు మేకొని రా నయి యున్న యత్తఱిన్
మేదురవైరిభూమిపుఁడు మిమ్ములఁ జేరిన దానఁ జేసి కా
దే దుర మావహిల్లు నని దేవరఁ జూడఁగ రామి రావుకున్?

కాఁబట్టి మాయం దట్టితక్సీరు మాపు చేసి యెప్పటియట్ల బొబ్బిలిని రంగారావు గారికిఁ గవులు దయచేయింపుఁడు. ఇప్పుడె రంగారావుగారికి మీదర్శనంబునకు రాఁ గబురు పంపెద.

హైద—ఏమీ? అట్లయినం గాని రాఁడుగా? మాయు మసలి మాటతోఁ బోరఁగా నున్నాఁడు. మాకుఁ దెలిసినది బహాద్దర్ జల్లీల నెందు నిట్టి రాజును జూచి యుండ లేదు.



దమ్మ—అట్లు గాదు. మహాప్రభూ!

హైద—

గీ. మేముకోలును వ్రాయము మీదొరయును। రా నవసరంబు లేదు పోరయ మెసంగఁ
బ్రోలు బైల్వెళ్లి జాగాను బూటలోన। ఖాళీ చేయింపు మని చెప్పు ఖండితముగ.

దమ్మ—ఎంత నుడివినఁ దాఁ బట్టినకుందేటికి మూఁడేకాళ్ళని చెప్పుచున్న నేమన గలవారము. మీయిష్టము వచ్చినట్లొనరింపుము.

హైద—అట్లే చేసెదము లే.

దమ్మ—మీ కిట్టిదురాగ్రహవృత్తి మాయెడల నేల కలుగవలె? స్వామీ!

హైద—మీ కీపెంకెబుద్ధి యేల?

దమ్మ—మావల్ల గోరంతయుఁ దప్పు లేదయ్యా ఖాన్ వర్యా!

గీ. భూమిఖామందులము మేము పోట్టులాట। దగునె మాతోడ నిల గుత్తదారులకును?
బుద్ధిహీనపుఁబోకిళ్ళఁ బోవఁ జనదు। గుడ్డుపిల్లను భ్రమింపఁ గోరినట్లు,

తక్షణము బొబ్బిలి విడిచి లేచిపొమ్మని మీరాజుతోఁ జెప్పు. పో!

వెంక—(తనలో) ఏమిష్టి? వీఁడు కోట విడిచి లేచిపొమ్మనును? (ప్రకాశముగా) తమకీదురాగ్రహ మేల? రమ్మని తెల్పెడుకొలఁ జూచినదక్షణమే రాజు రానై యున్నాఁడు.

హైద—రా నక్కఱ లేదు. లేచిపోవునా లేదా?

వెంక—

గీ. రావువారలతో మీకు రాపు గలదె। యెప్పుడైనను? సాహేబ! యేటి కింత
వింతకార్పణ్యమూన? మే మెంతవార। మయ్య మీరల్క సేసిన నాఁగఁగలమె?

హైద—అవును. కార్పణ్యమే?

వెంక—

క. నడిచితి మే దుష్పథముల। ముడిచితి మే పరధనముల మూర్ఖతతోడన్
విడిచితి మే నయగతులను। గడిచితి మే యాజ్ఞ నతులగంధము మీఱన్.

ప్రోలు విడవాడి పొమ్మను టేటినడువడి. తురుష్కాగ్రణీ!

హైద—

గీ. తప్పు గల్గియు మఱుమాటఁ జెప్పఁ దగునె?। రమ్మనంగను రామి పరానుపార
సీతు లెంతయు ద్రోహావిచింతను లని। చేరి బందరు చెప్పుట లన్నియు వినుమెకా

అన్నిటికంటె నెక్కుడుగ మాసైనికులఁ బంపు టేల? మాకు మిమ్ముల నేమిసేతునో? మీవిషయమై యింతయుఁ జాలిఁ దలఁప రాదు.

వెంక—

క. మీ కపకారము గాదది । మా కుపకారంబుగాని మాన్యవం! మహా
నీకమునుఁజంప నెఱుఁగము । మీ కేటికిఁ గోపః? మేల మిథ్యావాక్కుల్?

ఇవియా మీయాగ్రహకారణంబులు. ఎంతతప్పు సేసితిమి?

హైద—వట్టిపరిహాసము చేయకుము. జాగ్రత్త (అని కత్తితో జళిపించుచున్నాఁడు.)

వెంక—మీవంటిసాహేబునుబాలవలన శేబాసు గీలు పొంది యుంటిమి. కాలఁగా వలె నన్నఁ గంటక మేమి?

హైద—అట్టివారైన నిట్టియవ్యక్తుల రే లయ్యెదరు? అందుకు మీరు దగరు. ఒక్క నిముష మైనను మాపట్టణంబున నుండఁ జనదు.

వెంక—

క. మీ రట్లు వాంఛఁ జేసిరి । రారాజును వీడి రండు రభసము మీఱం
బోరామి నేగెదము పొలు । పాఱన్ పనియింతియె గాని హైదర! వీటన్.

హైద—మ మ్మాజ్ఞ వెట్టుదార్ఢ్యము కూడఁ గలదా? నాయిచ్చ వచ్చినట్లు చేసెద. అతనికే యిచ్చివేసెద. ఏమిసేతురో చూతును.

వెంక—“మీరు లేచిపొండి. మీవిరోధులను బ్రివేళ పెట్టెద„ నన్నమాట మీ రనరానిది మావంటివారు వినరానిది.

హైద—మీపౌరుషము దెలియఁబోవుచున్నదిగా.

ఉ. చూచెదు గాక మద్బలము చూళికలం గొని చంపవేత్రతల్
ఈఁచ మడంచువేళ నిఁక పేలుట మానుము భీతి దక్కి యా
నీచుఁడు మాబలంబు గన నేర్చునె దొండము గల్గినంత సం
కోచములేక నేనుఁగును గోడిగ మాడెడిదంతి మట్లులన్.

వెంక—

ఉ. ఎంతబలంబు నేకురిన నెంతటిపౌరుష మున్నఁ గాల మ
త్యంతము చెంత యైనఁ గనఁ బోలునె మీబలపౌరుషంబులున్?
దంతి యఖండవిక్రమము దార్కొనఁ గానఁ జరించు చుండగా
నంతమునందుఁ బట్టువడు నాఁ గద జాలరి వన్ను తాళ్ళకున్.

హైద—ఏ మాకఁ బు పేలాపన? నోరు మూయింతుఁ. జామీ నౌకర్. నికాల్.



వెంక—మాప్రాణంబుల నైనఁ గోల్పోదుము గాని బొబ్బిలిమాత్రము విడువము. అన్యాయయుద్ధమునకు రాము. న్యాయయుద్ధంబునకు వెఱవము. ఇప్పుడు మీరు రణంబు తప్ప దన్న వెనుక దీయము. దైవము వ్రాసినరీతిగ జరుగఁ గలదు. మీతో వాద మెందుకు?

దమ్మ—సాహేబుగారూ! మేము చెప్పినవాని దూర మాలోచింపుడు. చేయి జారినఁ జేయునది లేదు.



హైద—అట్టిది మీరే యాలోచించుకొనుఁడు.

దమ్మన్న— / వెంక— } సెలవు గైకొనెదము. సాహేబుగారూ! సలామ్. (అని నిష్క్రమించుచున్నారు.)

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ప్రదేశము—బొబ్బిలిరాజు సభ.

రంగా—తమ్ముఁడా! వెంగళ్రాయఁడా! మన మాగోయందొరవారివద్ద కంపినబుచ్చెన్న గారు రా లేదా?

వెంగ—అగ్రజా! ఇదె వచ్చె.

బుచ్చె—మహాప్రభూ! తమరాక కై నిరీక్షించుచున్నాఁడ.

రంగా—మీ రేఁగినపని యే మైనది?

బుచ్చె—మహారాజా! పయనం బై పోవునాటిదినంబునఁ బెద్దాపురంబున విజయరామరాజుం జూచి ముచ్చటించితిని.

రంగా—ఏ మని ముచ్చటించితివి?

బుచ్చె—

గీ. మాటలాడితిఁ బ్రకృతోద్యమంబుసరణి । విముఖుఁ డై రాజు గన్పట్టె వెల్లబాణి
మనమున ననూయ యెంతయు మానుకొల్పి । నట్లు గనిపెట్టిపోతి నే నలఘుగతిని.

రంగా—చూ పోపమిం జేసియే గాని యిట్టియధర్మంబున కొడి గట్టుకొనుటకుఁ గారణ మేమి? అట్టివాఁడు భూతలంబున బాగుపడునె?

గీ. పూసపాట్యానురాన్వయాంభోనిధి బడ । బానలనిభ విజయరామపార్థివదళ
లపనుఁడిలఁ బరత్క్షేత్రాప్తిలయముఁగనఁడె । రంగరాయని నిశితశస్త్రములఁగలన?

తరువాత?

బుచ్చె—దేవా! తరువాత నచ్చోటు వాసి మునలమానుని చిత్తవృత్తి నరయఁ గోరి రాణ్మహేంద్రవరపురంబుఁ బ్రవేశించి తురష్కపరాసుదుష్టజనాభ్యంచితసభాంతరంబున గుడమిళద్ధూమనిచయపూత్కారవక్త్రసంగుండును, కాదంబరీపానావేశదురంతనితాంతాగ్రహారుణకరాళవదనోదితగంభీరవాజ్నిర్ఘోషపరికంపితసభ్యాంతరంగుండు నగు హైదరుజంగుం గాంచితి.

రంగా—వానితో ముచ్చటించితివా?

బుచ్చె—మనకును వారికిని బుత్రజనకభావంబునఁ గల్పించి యనేకభంగుల మనవలనఁ దప్పొకించుకైనను లేదని ప్రియవాక్కులఁ బ్రార్థనపూర్వకముగ మనవి సేసితివి గాని,

గీ. రంగరావిప్రమముఁ జూడరానవసర । మెంతయును లేదు మేమ యేతెంతు మటను
నంచుఁ జెప్పెను గాని యొకించెకైన । సంధిమార్గప్రశంసయే జరుపఁడయ్యె.

రంగా—అట్లనెనా? కానిమ్ము. తురకలవీర్యంబును రావువారిశౌర్యంబును జూచును గాక. తరువాత?

బుచ్చె—దేవా! నిజమార్గంబు పట్టి కతిపయదివసంబులకు బందరుపట్టణంబునకుఁ బోయి చిరత్నరత్నమాత్న్నాయతనంబునఁ బేరోలగం బున్న గోరుందొరను జెంగట ముచ్చటించు చున్న మద్దాలరెడ్డినాయనిం గాంచితి.

రంగా—వారేమనిరి?

బుచ్చె—

గీ. వారును మనపక్షముననే వాద మొకరఁ । జేసి బహుభంగులను వారినేత లగ్గ
డించి యొకలేఖ వ్రాసిపంపించిరటకుఁ । గూర్మి మీఱంగ నిటు చేయఁగూడదనుచు.

అమర్టైనుతో నేను నరిగితి.

రంగా—ఆహా! నాయందలివాత్సల్యత. గోరుందొర యంతపనిఁ జేసె నేమి? బుచ్చెనా? నావిషయమై యెంతశ్రమఁ పడితివోయి. తరువాత?

బుచ్చె—వాని వెంటఁ గొని యెట్టకేలకు ఖాసింకోటఁ బ్రవేశించి బుస్సీకిఁ జూపింప,

గీ. "దొసవు దొరలె నీకతనను దొరయఁ జేయఁ । దగునె యొగ్గులు? నావెల్మధరణిపతికి
దొరకుదొరకొనదొరలకుదొరలుదొసఁగు" నను హైదరు న్దూలంగనాడె దొరయు.

రంగా—తూలనాడఁడో? బుస్సీ యిందులో నిరపరాధి. దీనికంతకుఁ గారణ మా హైదరు. వీఁడు రాకున్నను బుస్సీ యీకొన కున్న నిట్టికథ కవసరమే లేదు గదా. తరువాత?



బుచ్చె—హైదరేమి విరుగుడులఁ గల్పించి వ్రాక్రుచ్చెనో గాని బుస్సీ వాని కెదురాడలేకపోయె.

రంగా—ఇదంతయు వీనివలనఁ బుట్టినదే గదా. వాఁడు సౌఖ్యములఁ బొదలనీఁడు.

గీ. రాజు దుర్బోధనలచేతఁ ద్రాడువారి । యెవరు సెప్పిన వినకుండె నెట్టిమూర్ఖు?
తొల్లి వినలేదె తురకలు దుష్టవర్త । నలను సామెత పల్కుటయిల వకీల!

బుచ్చె—అటు తరువాత మర్టైనావ్వాయుఁడును గొంతపడి ముచ్చటించెను గాని వినఁడాయె. ఇం తెందుకు? యుద్ధంబు గర్తవ్యంబు.

రంగా—పాపము నీకు వృథాప్రయాసము గల్పించితినే. ఈతురక సంధి పొసఁగనియ్యఁడని తెలిసి యుండియు వెఱ్ఱిపడితిని. ఎట్లైనను సంధి యగుట జనులకు సౌఖ్యము గదా.

గీ. మేము మేమును బోరాడ మేదినిఁగల । ప్రజల కత్యంత మసుఖంబు ప్రాప్తమౌన
టంచు మది నెంచి సంధిపాటించి వాను । గాని వినఁడయ్యెను మొఱకు కఱకు తురక.

బుచ్చె—ఇంతియ నావర్తమానము రాజేంద్రా!

రంగా—వెంగళ్రాయఁడా! ఏమి యీతురుష్కాగ్రణి దురాగతము? ఆబుస్సీ యెట్టి బుద్ధిహీనుఁడో.

గీ. గొప్పవారనుకొనే గాని గొప్పదొరలు । మంత్రులాడించు కీలుబొమ్మలు నిజంబు
నిజపరిజ్ఞానశూన్యులై నెగడు కతన । వారిమహిమంబు భువి నేతిబీరకాయ.

వెంగ—అన్నయ్యగారూ! అది నిజము. ఇంతేల? యుద్ధంబునకుఁ గాలు దువ్వుచు సంధిమాట లన్నఁ జెవిఁ బెట్టక పరపంథిరాజు దుర్బోధనా క్రోధావేశపరవశత్వంబున మిన్నుమన్నెఱుంగక యీపరాసురాయని సైనం జీరికిం గొనక పైపై రానెంచుచున్నాఁడు. మనము భయఁపడుదుమని యెంచెఁ గాఁబోలు.

రంగా—బుస్సీ బుద్ధిమంతుఁ డనియు స్వాతంత్ర్యశక్తియుక్తుం డనియు నామది నెంతయు సంతసించితిని గాని హైదర్జంగాభిధేయ పాపిష్ఠగ్రహావేశపీడితుం డౌట మెఱుంగను. అట్టిడు గాన నే గురూపమానుం డగు గోరుందొరను నిరాకరించి వానిమాటలఁ బెడచెవిం బెట్టె.

వెంగ—

కం. ఎవరేవిధమునఁ జెప్పిన । నవు నంచును దలను ద్రిప్పు నధిపతి గలుగన్
భువిజనుల కెట్లు గల్గును । బ్రవృతసౌఖ్యయంబు దీనిఁ బాటింపఁడొకో.

అయిన నిట్టి నీతి యిక్కాలంబున నేదొరలయందుఁ గలదు ? ఇప్పటి యధికారులందఱ ట్టివారే.

రంగా—

గీ. న్యాయయుద్ధంబు సేయుర నదియు లెస్స । వ్యాజహీనంబు కలహంబుప్రాప్తమాట
యహితరాజందుఁజేరియప్రియములాడు । టయినుగూడంగ నెటువారిడాయనగును?

వెంగ— అగ్రజా ! అయిన నేమి ? అన్యాయంబుగ రాజునకుఁ బరశురాముఁ డొండె నగ్నిహోత్రుఁ డొండె శివుఁ డొండెఁ దోడ్పడ నిమ్ము. మనము యుద్ధముఁ జేయకుందుమే?

రంగా— మాన నేల ? అట్టియపఖ్యాతి వారినే చెందుఁ గాక కీర్తిపదార్థంబు నొంద శౌర్యధనంబును దాచుకొందుమే ? కాని రా జన్నివిధంబుల సంపన్నుఁడై యున్న వాఁడు.

వెంగ— శా. అన్నా ! యుద్ధమటన్న సందియము లే దావంతయు న్వైరి సం
పన్నాంధత్వము మత్ప్రతాపరవిరుగ్వ్యాప్తిం బటాపంచలై
బన్న బొందదె? ఘోరవీరణభూభాగంబునం బ్రీతరా
ట్సాన్నిధ్యంబున కంప నే రిపులె? మత్సామర్థ్యమే పారఁగన్.

రంగా— అట్టిసందేహ మెంతయు లేదు.

వెంగ— కానిమ్ము. దైవ మెట్లూహించెనో యట్లు జరుగక మానదు. కాన జరుగుదాని కావటించుట మనపని. అనుమానించుట వెఱ్ఱి.

రంగా— అవును బాగుగఁ జెప్పితివి. మనము దివాణమువారికడ కంపినవకీళ్లును వచ్చియున్నారా మంత్రివరా?

మంత్రి— వచ్చినారు రాజా !

దమ్మ— మహాప్రభూ! వచ్చి యున్నాము. తమసందేశము ఖానుతో విన్నవించినాము.

రంగా— వాఁ డేమనె ?

దమ్మ— వాఁ డెంతయు రోషభీషణనేత్రాగ్నికీలల నేరి నైనను దహించురీతింగన్పట్టె.

రంగా— వాఁ డట్లుండుటకుఁ గారణమేమి ?

దమ్మ—

గీ. వారిసైనికు లిటకు రా వైర మూని । యందుఁ గొందఱు నొంచితి రఁట యితరులఁ
గాయములు గాయములువడఁ గాందిశీక । తనువెసంబాఱఁగా మీరుతఱిమితిరఁట.



రంగా— తమ్ముఁడా ! మంత్రులారా ! సభికులారా! మాదితిరా! ఈదుష్కృత్యము మన మెఱుంగము గదా. ఇది మనవిరోధిరాజు పన్నినపన్నిక గాఁ దోఁచు చున్నది. ఆహా! ఎంతకార్పణ్యము వహించి యున్నాఁడు. మనభూమిలో జరిగినది గాన మనమే చేసినా మని తలంచుటకు వీలుగ నున్నది కదా.

వెంగ— వాఁ డెన్నిటి నైనం జేయును. మం మెుఁర్చతి మని వారికోఁ జెప్పును. మన మేమి సేయఁగలము?

రంగా— వాఁ డేమనె?

దమ్మ—

క. అర్థాపేక్షను హైదరు । స్మర్థన్ బ్రోల్వీడి మనలఁ జను మనియెను గా
వ్యర్థాలాపము లేటికి । సార్థకవాహులము? పోవఁ జయ్యెన రాజా!

రంగా— మనల బెదరించుటకు ని ట్లాడుట వారికి సైజమే.

వెంగ— మన మ ల్లెంతయుం దలఁపఁ గూడదు.

శా. అన్నా! యెంతటివెఱ్ఱివాఁడవు గడీ నన్యాయమే వీడి పా
మన్నాఁ డాతఁడు ఖానుఁ డిపు మనలన్ మర్యాద లే కింతయున్
భిన్నం బౌ గతి నెంచఁ గూడదు సుమీ భీమహవక్రీడ కే
సన్నాహంబు దలంచె హైద రెద నిస్సందేహమే పాఱఁగాన్.

రంగా— కోరినధన మిత్తు మంటిమి. మనవలన నపరాధ మేమి ? పిల్లలమేకలతో నున్నమనలను లేచిపొమ్మనుట మాటలా? అట్టిపని వా రేల చేయు మందురు?

వెంగ—

క. ఉత్తమధార్మికు లగుమీ । రిత్తెఱఁగునఁ నాచరింప నీకొవరు. కృధా
చిత్తుఁ డగుహైద రిత్తతి । నెత్తెఱఁగునఁ బాటిఁ జేయు నీధర్మంబుల్.

వెంకయ్య— వెంగళరావుగారు సెల విచ్చినది నిజము. మనము వేఱుగాఁ దలఁపరాదు. అఖానుం డెనిన్నిమాటలఁ జెప్పిన యుద్ధ మనుమాటయే గాని సంధిమాట నొక్కటైన నడువ లేదు.

వెంగ— సోదరా! మీ రింకను బెడతొరవనే యున్నారు.

మత్తకోకిల. వైరిభూపతి దుష్టవాక్కృతి బాడబాగ్నిజనింప లోఁ
బారసీకపుసైన్యకంధి యపారమై మనభూమి దు
ర్వార మౌ గతి ముంచ వచ్చెడి రావునఁ శౌర్యభుజాబలో
ద్దారుణీధరరాజి నడ్డము దార్చ నక్కర లే దొకో.

రంగా—మన మిప్పు డేమి సేయవలసి యున్నది?

వెంగ—

గీ. భానుఁ గ్రమ్మఁగ వచ్చు స్వర్భానుపగిది । హైద రుగ్రుఁడై సంగ్రామమోద మెసఁగ
వచ్చుచున్నవాఁ డింక భావ్యప్రయత్న । పాళితో సిద్ధమై యుంట మేలు మనకు.

రంగా—ఎందు కైనను మంచిదే. తమ్ముఁడా! ఆలాగే చేయుదము.

వెంకయ్య—

గీ. సమర మిఁక మీఁద దప్పని సరియె గాన । రేకపల్లివనాళిలో నేపకడనె
వనజవదనల నభిమానధనల నెల్ల । దాచ మే లగు నని యెంచెదను విభుండ,

వెంగ—

గీ. అడవిపాలు సేయుట యది యెంతయును గ్రూర । కర్మ మెంచ వారు కడను లేని
దుఃఖ మాత్మలోన దూకొను మఱికొంత । యట్టిసేఁత కొప్ప దాత్మలోన.

రంగా—అరిరాజును వెంటఁ గొని పరాసులు నేఁడు మనపైఁ గుమ్మరునెడ మనము పాఱి పోయి దాగియుండుట మంచిపనియే? మేటిమగంటిమి గలపోటరు లనేకులు మన కుండ నిట్టిభయ మేల?

గీ. సమరమునఁ బోరి యాసూర్యచంద్రముగ న । ఖండవిజయముఁ బొందుట ఖ్యాతి గాని
గత్వరం బగుప్రాణముల్ గాచికొనఁగఁ । గాన దాగుట తగ వేది ఖ్యాతి యగునె?

వెంగ—అన్నయ్యగారూ! బాపురే! బాగుగఁ జెప్పితిరి.

మహాస్రగ్ధర. వెంగళారియోగ్రదోర్భృత్పృథులవిశిఖదర్వీకరంబాజి హైదర్
జంగాభీలాయుధీయోచ్చయపృదనభస్వంతము ల్జగ్ధి గాఁగన్
గ్రమ్మఁగన్ రంగప్రభుం డీత్రిభువనముల నిర్నిద్రశుంభత్ప్రతాపా
భంగశ్రీ మించు మండాం బ్రబల యశముఁ జే పట్టనున్నాఁడు గాదే.

పాపయ్య—నే నుండ మీ కెట్టిసంశయము గలుగఁ గూడదు ఏల నన,

గీ. వైరి దుర్వారగాంభీర్యవారిరాశి । పంక్తిఁ జెల్లాకు చెదరగాఁ బాఱఁ దోలుఁ
దాండ్రపాపయ్యకల్పాంతధాష్వర్ఘుంర్ఘు । యబ్ధులను దాటి మాయమౌనట్లు గాఁగ.

చె॥ వెంక—

గీ. మున్ను రాజాముకోటను ముట్టడించఁ । బాదుషా యంత వానిని బాఱఁదోలి
జయము చేకొంటి హాయిదరాజం గనంగ । భీతియే నాకుఁ? గరము సంప్రీతి గాని.

దమ్మ—గీ. గోత్రపావన! దమ్మనగోత్రభిదుఁడు
గోత్ర మరుదంద దా మెరగోత్ర మఖిల



యశము వొందంగ నిజశితాస్యశనిధార
శత్రుగోత్రాచలంబుల శాత్రవము
జెండిచెండాడును ధ్వండభనిడనమున.

బుచ్చె—

క. పంతముఁ బట్టి శత్రువు । నంతకు నంతికమునకును ననుపుదు ధరణీ
కాంతా సంశయ మేటికి । పంతెనవంశ్యప్రతాపలను తెలుఁగవో.

రంగా—మేటిజోదులారా! మీపరాక్రమముల వర్ణింప నలవి గాదు.

వెంగ—మీకు మేమందఱము గానరా? మీబలంబు మీరెఱుంగరు. అన యునకు మీ రొక్క రేఁగిన రిపుసైన్యములు పంచబంగాళమై పోవే?

రంగా—ఇట్టిదుర్గ మిట్టిసైన్య మిట్టివీరులుఁ గలుగఁగ నాకు భయ మేల?

మత్తకోకిల. ప్రాణ ముండిన నేలెదన్ భువి రాజ్య మెల్లను భోరునన్
ప్రాణ మూడిన నేలెదన్ దివి రాజ్య మెల్లను భోరునన్
జాణ నైనకుటుంబి నౌచును శాశ్వతం బగుకీర్తి చే
రాణువ న్నను జంక నేల దురంబు సేయఁగఁ బోవుచున్.

వెంగ—సోదరాగ్రణీ! నిజము. చావునకు రెండుచావులు గలవా? జయాపజయంబులు దైవాధీనంబులు వారి కెంతబల ముండిన నేమి?

రంగా—తమ్ముఁడా! సంధి యొనఁగూడు నేమో యని యోజించు చుంటిని గాని సంగ్రామంబు సమకూడ వెనుక కడు గిడెదమా?

వెంగ—మీరు చెప్పినదే పౌరుషము.

రంగా—బంధువులారా! మిత్రులారా! మాతోపాటు యుద్ధమునకు రా నిష్టమున్న రండు. లే కున్నఁ బొండు. ఏదో యొకవిధముగఁ గృతనిశ్చయుల రగుఁడు.

వెంగ—రాజా! మీ రే సంగ్రామంబున కరుగ నొక రింటివద్ద పోయి ననుభవించు వారలు గలరా?

వెంగ—అందఱము మీవెంట నరుగుదెంచువారమే రాజేంద్రా!

రంగా—మంత్రివరా! అట్లయిన సంగ్రామసన్నద్ధుల మై యుండవలయును గదా! విజయరామరాజున కెదురొగ్గు రాజాంకోటను ముందు సంరక్షింపవలసియున్నది. ఏమి మీయభిప్రాయము?

మంత్రి—నిజము రాజాగ్రణీ! రాజామకోట బహుబలశాలి యురుబలంబుతోఁ గాయవలసిన స్థలము.

రంగా—ఎవ్వరి నటకుఁ బంపిన బాగగు?

మంత్రి—మనతాండ్రపాపయ్యకంటె సమర్థులెవ్వరు స్వామీ!

రంగా—అవును పాపయ్యా! నీవు వెంటనే చతురంగబలసమన్వితుఁడవై చని రాజాం కోటను సంరక్షించుచుండుము. ఆ కోట పోయిన మనసర్వమును బోయినదే సుమా.

పాప—మహాప్రసాదము స్వామీ! పాపయ్యనారసింహము చచ్చుటఁ గావలి యుండ బెరజంతువు వచ్చి ప్రాణముతోఁ బోవ నేర్చునే? ఆకోటపూచీ నాది కాని యిక్కడ బహుజాగ్రత్తతో నుండుఁడు. మఱియు,

గీ. మిమ్ము విడిచి పోవ మే కోన కున్నది। నాదుడెంద మహహ! నరవరాగ్రఁ
దప్పి నడచుటయు దగవుగా దియ్యెడ। నేమిసేయువాఁడ నీశ్వరాజ్ఞ.

రంగా—పాపయ్యా! మాయందుఁ గలప్రేమాతిశయముకొలందిని మమ్ము విడవాడుటకు నీమన సొల్లమి నే నెఱుంగుదు. ఆపని యైన నాదే గదా?

పాప—అయినను మిము వీడి పోవుటకు నాడెందంబు గడుఁ గుందుచున్నది. నా మనంబునం గలవిచారము వెల్లువయై పాఱుచున్నది. నే నేగఁజాల. (అని కంటఁ దడి పెట్టుకొను చున్నాఁడు.)

గీ. ఇప్పుడే మమ్ము నెడబాప నెంచితే కట। దైవమా! యెంతపాపిష్ఠజీవి నైతిఁ
బ్రాణములతోన రాజును బాయవలసెఁ। జేత నగుదానిఁ జేయ లే నైతి నింక.

రంగా—ఏమి యీవెఱ్ఱి పాపయ్యా! ఎందు కిట్టిసంతాపము. ఇప్పుడు నీకుఁ గల్గు భయ మేమి?

శా. రంగారాయని శాతఖడ్గమహితారణ్యంబును జైంచ ను
త్తుంగాభీలరిపుప్రతాపజల గర్వారకల్పానిలా
భంగప్రౌఢిని దత్కరంబు మెఱయన్ బాపయ్యా! నీ కిప్పు డే
భంగి జేకురు నయ్య యాపదలు? సద్భావంబుతో నుండుమా.

పాప—చిత్తము. మీగంభీరవాక్కులచేఁ గొంతధైర్యము గల్గుచున్నది. ఏ మైన సరే. పోయి వచ్చెదను. (అని సేనతోఁ గదలిపోవు చున్నాఁడు)

రంగా—మంత్రివర్యా! భూనభోంతరాళంబులు భోరుకొల్పుముసలమాను లొసంగిన మననిశానీనాబత్తును బజాయింపు మని నియమింపుము. మఱియు మనగడీలంగము చుట్టును దగుసైన్యముల ఫారా యుంచి గస్తు తిరుగఁ బంపుము. బురుజులపై నున శతఘ్నికాసంతతిని గుద్దుర్ల ఘటిల్లింపుము. బిరుసువస్తాదులఁ గొందఱిని రాజామహ



హారిలోఁ గొందఱిని గోటగుమ్మమువద్దఁ గొందఱిని బురుజులసన్నిధిని గొందఱిని బురీద్వారంబున నుండఁ బంపుము.

మంత్రి—అట్లనే యొనర్చెదను రాజేంద్రా! (అని పోయి యట్లొనరింప నాజ్ఞ చేసి వచ్చు చున్నాఁడు)

రంగా—శూరాగ్రేసరు లగుదమ్మన్నప్రభృతిమిత్రవరులారా! మీరందఱును బాహువులను సారించుకొని జన్యంబున కావటింపుఁడు.

దమ్మ—సిద్ధముగా నున్నాము స్వామీ!

రంగా—సచివాగ్రణీ! తక్కినసేనలకు యుద్ధంబు దెలిపి సిద్ధముగ నుండఁ బంపుము. పరశుపట్టిసముసలకుంతతోమర భిండివాలము ద్గరంబులకుఁగఱుకుఁ బెట్టింపుము. బాణములఁ జికిలీ చేయింపుము.

మంత్రి—మహాప్రసాదము భూవరా!

రంగా—శా. కల్పాంతోద్భవ మేఘగర్జితమహాగాఢారనాభీల మై
కల్పవ్యాకులరోదసీకుహర మై కాష్ఠేభబాధిర్యసం
కల్పానల్పసమర్థ మై భయద మై ఘంటారవాక్రాంత మై
పొల్పొందన్ విన వచ్చెడి న్సచివ! యాభూరిస్వనం బేమొకో.

మంత్రి—ఆలకించుచున్నాఁడు. (అందఱు నద్భుతఁపడు చున్నారు.)

[చారులు ప్రవేశించు చున్నారు.]

చారు—రాజేంద్రా! పరాక్. రాఘువంశక్షీరపారావారరాకాసుధాకరా! పరాక్. వార్ధిగంభీరా! పరాక్. గోపాలకృష్ణరంగారాయక్షమావల్లభా! పరాక్.

రంగా—ఏమిరా వార్తలు?

చారు—పారసీకసైన్య మపార మై వచ్చు చుండఁగా నేమని యడుగు చున్నారా?

రంగా—వచ్చినదా? ఎచ్చట నున్నారురా?

చారు—వచ్చినది స్వామీ! ఇచ్చటికి క్రోశద్వయదూరమున నున్న కాసారతీరంబున విడిసినారు.

రంగా—మంత్రిపుంగవా! మనము విన్నధ్వని యిదే సుమా. ఏదో యనుకొంటిమి.

మంత్రి—వేఱే లగు? వారు యుద్ధము సేయుగట్టితలంపున వచ్చినారు రాజా!

రంగా—చారులారా! వారిసేనను జూచితిరా?

చారు—మాఱువేషంబునఁ బోయి చూచి వచ్చినాము రాజేంద్రా!

రంగా—అద్దిరా! చారులారా! ఏంతపాటిది?

చారు—దేవా! విజయరామరాజుసేన పదునొకండువేలు.

రంగా—మంత్రివరా! చూచితే! మనసేనకు మూఁడురెట్లదే యున్నది.

మంత్రి—రాజేంద్రా! వీరందఱు సేవకులుగాని సైనికులు గారు. సారములేనిది గంపెడేల?

రంగా—చారులారా! బుస్సీసైన్య మెంత?

చారు—రాజాగ్రణీ! ఇన్నూటయేబండ్రిగుఱ్ఱపురౌతులు నాలుగుఫిరంగులు, ఏడువందలయేబదిమందిలా, రాను మొదలగుతెల్లవారును. మహాప్రభూ!

రంగా—అబ్బా! రిపుసైన్యార్ణవంబు దీర్ణం బై పెల్లుబ్బెడిని. మంత్రిపుంగవా! మన సైన్య మెంత?

మంత్రి—రాజేంద్రా! మనబలము నాలుగువేలుమాత్రమే.

రంగా—ఈ కొద్దిబలముచె రిపుల నోర్వఁ గలమే?

మంత్రి—అ దెంతపని? మనలో నొక్కశూరునికి వారందఱుఁ జాలుదురా?

రంగా—

గీ. భార మంతయు నిల్పి దైవంబునందే। గెల్చినను గెల్వకున్నను నిల్చియుండి
యాలమందున శత్రుల నోల మాన। గొనక పోరుటయే లెస్స గొంకులేక.

చారులారా! ఇంకను విశేషము లేమి?

చారు—రాజేంద్రా! అచ్చట సేన విడియఁగానే మననౌబత్ఖానా హైదర్జంగుకర్ణపుటభేదనంబు గావించినది.

రంగా—ఆపైని.

చారు—ఆమీఁద హైదరుగ్రుఁడై విలయకాలరుద్రునిపగిది దండతాడితమృత్యువు కరణి జగజ్జాలంబు లొక్కుమ్మడిఁ గబళింపఁ గమకించుకాళరాత్రివలె లేచి రోషభీషణానలకణంబులు నేత్రంబులఁ బొటపొట రాల రోషంబు గ్రక్కుచుఁ బండ్లు పటపటఁ గొఱుకుచు నౌకరుతో నిట్లనె.

రంగా—ఏ మనెనో చెప్పుము.

చారు—

గీ. "గణితభీషణరోషాంతరాళకంబు। ప్రళయదిగ్దంతినిర్ఘోషవారకంబు
భీమవీరారిహృద్గ్రంథిభేదకంబు। భీమనాదంబు విన వచ్చుఁ బెలుచ నెచట?" అని



రంగా—నౌక రేమనె?

చారు—మహాప్రభూ! నౌకరా.

గీ. "అయ్యా! సాహేబుగారు! మీ రాలకించు। నాఘునాఘునభీమగర్జారవంబు
రణము సాగింప బొబ్బిరంగరాయ।ఘనుఁడు మ్రోగించు నౌబత్తునినద" మనియె.

రంగా—ఆపైని ఖానుం డెట్లనె.

చారు—రాజేంద్రా! సేవకునితో నిట్లనె. "సాహేబునుబా యిచ్చట కనతిదూరంబున దండు దిగి యున్నాఁడు. నీ విట్లెంతయు భయంబులేక నౌబత్తును బజాయింపు చున్నావు. ఈపని మాని వెంటనే కోట విడిచి లేచిపోయెదవా? లేదా? లేనియెడల రేపుదయమున యుద్ధము ప్రారంభ మగు నని చెప్పు" మని పంపి యున్నాఁడు.

రంగా—మంచిది చారులారా! మీరు పోయి రండు. (చారులు నిష్క్రమించు చున్నారు.)

[హాసనల్లిఖానుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

హస—రాజేంద్రా! సలామ్. మాయేలికయగు హైదరంపఁగా వచ్చినహసనల్లీ యనువాఁడ.

రంగా—మిగుల సంతసంబయ్యె. ఖానుఁడా! ఇట్లు కూర్చుండుము. (అని కుర్చీ యిచ్చుచున్నాఁడు)

హస—భూమివరా! నేమం బే?

రంగా—మీదయచే నింతవఱకు నేమమే.

హస—రాజా! మీవంటియౌదార్యసద్గుణగరిష్ఠుండు గలఁడె? మీప్రఖ్యాతి మేము వినుచుంటిమి గదా. అట్లనియెద రేల?

రంగా—మంచిది ఖానువర్యా! నీరాకకుఁ గతంబేమి?

హస—భూకాంతా! మీరు మ్రోగింపఁజేయు నౌబత్తు మానివేయుమని బొబ్బిలివిడిచి లేచిపొమ్మని మీతో మాఖానుండు నుడువు మనె. ఇదియ సందేశము.

రంగా—

గీ. పాదుసాగారు మున్ను మాపౌరుషమ్ము। మెచ్చి యిచ్చెను నౌబత్తు మేళవింప
దొంగతనముగ మ్రోగించుదు మెయిటాడఁ। దగునె ఖానుగుమటం చిరుధర్మమెఱియ?

ఇంతే గాక బలవంతముగ నితరులం దరిమి యీసాలంబుఁ బట్టికొని యుంటిమా? మా తాతముత్తవలు మొదలీ స్థలంబున బంధుమిత్రకళత్రంబులతోఁ గాపురములఁ జేయుచుంటిమి గాని నిన్న నేఁడు వచ్చినవారమా? వెళ్ళిపొమ్మను టేటి న్యాయము?

హస—

గీ. నిజమరివినుఁగాని యిటుల నిజమరియివు। డెటుల విన నేర్చు హైదరుచటుల దురుప
దేశమును బొంది యీ నుండె దేశికునకు। దేశరూపంబువో వాడి దేశ మెల్ల.

రాజు—ఖానువర్యా! వానిమాటలు విని యిట్లనుట తగునా?

హస—మా సైన్యములో ముప్పదిమందిని జంపితి వని మిగులరోషావేశపరవశుండై యున్నాఁడు. అదేమి?

రంగా—నిజము దైవ మెఱుఁగు. నీ వెట్లనుకొన్నను సరే. ఆసంగతి నేనెఱుంగను.

హస—రాజా! అట్లే కావచ్చును. సముద్రమేఖలాపరీతభూమి కధిపతి యయ్యును దురకబిడ్డం డయ్యును నీవైరిరాజు కొండెములు విని నిప్పు ద్రొక్కిన కోఁతివలె మండిపడుచున్నాఁడు. నే నేమి సెప్పినను వినఁడు.

రంగా—పండ్రెండులక్షుల శుభ్రములు లంచము గొని కాకిని గొట్టి గెద్దకు వేయుట మంచిదియే?

హస—రాజా! ఆతురక యట్లు చేసెద నని కత్తి ముట్టి సమయం బొనర్చె. ఎట్లు మానును?

రంగా—

గీ. మమ్ము యుద్ధమందు మార్కొని జయమొంది। పురముఁ జేకొనంగఁ బోలుఁ గాని
తరమె గెలువ కౌర పురమును జేకొన। హరునికైన గోత్రహరునికైన?

హస—అది న్యాయమే రాజేంద్రా! వలదని మే మెంత చెప్పినను వినఁడు.

రంగా—పోనిమ్ము. వినకున్న నేమి? నలువదివేలసేన వారిది. నాలుగువేలు మాది. చూతువు గాని బలాబలంబులు పౌరుషాపౌరుషంబులు,

హస—రాజా! నా మాట వినుము ఎట్లైనను వారు దివాణము వారు. మీరు జమీదారులు. అధికారము వారిది. అహంకారము మీది. ఈపట్లు నా మనవి వినఁదగు.

రంగా—అట్లంటివేని,

క. ఆరాజును నన్నిప్పుడు। పోరామి యొనర్ప నిమ్ము పోడిమి మిగులన్
మా రాజ్యము మాకొసఁగుము। మీ రట్లొనరింప మాకు మేలొదవుఁ గదా.

హస—అది నిజమే. అట్లేకొను నాథుఁ డేఁడీ?



రంగా—అట్లు గాదేని!

గీ. జనుల కెల్ల నీతిసత్య మాడుట గాని। తురకదొరల నీతి దుడ్డె గాన
కొనుము వలయునంత కూర్పుము నా కిల। విజయరామరాజు వీసు ఖాన!

హస—ఇం తేందుకు. వాఁ డట్టినీతులు వినువాఁడు గాఁడు నీవు వినినను వినకున్నను నేఁ జెప్పవలసినదానిం జెప్పెద. తురక ననుకొంటి వేమో జాతిం దురకను గాని మనస్సున నట్లు గాదు. పలువర్ణంబుల తెఱం గే నెఱుంగుదు. దయాసత్యశౌచంబుల హిందువులం బోలినవారు లేరు

రంగా—అయితే వాక్రుచ్చుము ఖాన్వర్యా! వినెదఁ గాక.

హస—దండకము:—శ్రీరస్తు. శ్రీరావువంశాగ్రణీ! రంగరాయకుమారవల్లభా! సావధానుండవై విందువం చెంతయున్న మైదన్ గైకదుర్బోధచేఁ దండ్రి పంపంగ శ్రీరామచంద్రుం డరణ్యస్థలిం బెక్కుకాలంబు కష్టంబులం బొందఁడే? ధార్తరాష్ట్రుండు గల్పింప నిక్కట్టులం బెక్కులం బొందఁడే! ధర్మసూనుండు ఘోరాటవిం దమ్ములం గూడి? యయ్యో! నలుం డుగ్రకాంతారసీమన్ బ్రియం బాసి దుర్బాధలన్ జెందఁడే? గాధిసూనుండు పెట్టన్ హరిశ్చంద్రభూపాలకుం డొందఁడే చెట్టలన్? భూములో నెంతవారైన దుష్కాలమాసన్నమౌవేళఁ గష్టంబులం బొందఁగా లేదే? తర్వాత సౌఖ్యంబులన్ జెందరే మంచిరోజుల్ సమీపింప? వారీతి నే రాజచంద్రుండ! యీదుష్టుఁడౌ ఖానుతోఁ బోరఁగా రాదు సుమ్మంటియే గాక యీభూమి ఖామందులౌ వారితో నుత్తరాల్లింతనైనమ్మయముల్వ్రాయుటల్లేకు లెగ్గింతురే గాని మే లందురే? యెంతదుర్మార్గులై యుండిన న్వారిచే మీరు మీచేయి క్రిందౌట నీపట్ల సాహేబు నాజ్ఞానుసారంబుగాఁ జేయఁగా మెచ్చి డెందంబునన్ జాలినిం బూని యీభూమి మీకిచ్చు. కాదంటిరా కిన్క రెట్టించి మీ కట్టియిక్కట్టులేఁ బెట్టఁగా వెన్కదీయండు యోజింపు మా నెమ్మది న్నమ్ము మీ దుష్టుతోఁ బోరుట ల్మానుటే యుక్తమా నిత్తఱిం బొబ్బిలి న్వీడి యెందేనిఁ గాలంబు సంప్రాప్తమౌదాక నుండేట కదున్ సేయ మానీఁద మీయిష్టమౌనట్లు రాజ్యంబు సర్వంబు మీ దౌను నిక్కంబు. నా మాట పాటింపు మీపట్ల రాజన్యచంద్రా! యశస్సాంద్ర! రంగాధిపేంద్రా! జయమ్.

రంగా—ఆహా! ఎట్టిసలహా చెప్పితివి? ఆరాతిభూపతి నాపై దురంబున కరుదెంచుచుండ నన్నడవులఁ బ్రాణంబులు దాచుకొను మనుచున్నావా? ఇంతకన్నా రావుగారికి దుష్కీర్తి కలదా?

హస—అట్లైన మీయిష్ట మగునట్లొనరింపుఁడు.

రంగా—

క. ఇంతి ప్మని చెప్పిన ధన। మంతయు నీఁ గలము వినుమ మహాసపృథ్వీ
కాంతకునిపురముఁ జేరుట। దెంతయు మే ల్మాకు బిరుదు నీఁగుటకంటున్

పో నిమ్ము. క్రీస్తుశకమునందుఁ బదు నేడువందలయేఁబదియేడవసంవత్సరమున జనవరి నెల నిరువదిమూఁడవది యగునీదివసంబ నాయాయుష్కాలంబునకుఁ దుదిరోజని విధి విధించెఁ గాబోలు. అస్థిరమైన నిత్తు నక్కఱలేకున్నఁ బ్రాణముల విడుచువారమే కాని యిట్టిపౌరుషహీనంబు లగుపను లొనర్చువారము గా మని చెప్పుము. ఇంతకంటె నే ననవలసినది లేదు.

హస—అట్లయిన రేపుదయముననే యుద్ధము ప్రారంభ మగు నని హైదరు మీతోఁ జెప్ప మనె. తయారుగ నుండుఁడు రాజా!

రంగా—మంచిది హసనల్లీఖానుఁడా! మే మీరోజుననే నౌబత్తును మ్రోగింపఁ జేయించు చుంటిమి గదా!

హస—రాజేంద్రా! సను సెలవు గైకొనెదను.

రంగా—మంచిది పోయి రమ్ము. (హసనల్లీ నిష్క్రమించు చున్నాఁడు.)

మంత్రివరా! వింటివిగదా? రేపుదయముననే యుద్ధ మారంభ మగు నని హసనల్లీ చెప్పిపోయె. మనమును దయారుగ నుండవలెను. సమస్తమును సిద్ధముగ నుండెనా?

మంత్రి—సర్వమును సిద్ధముగ నున్నది రాజా!

రంగా—అట్లయిన నేను ముందుగ సంగరంబున కేగెద. మీరందఱుమ వేఁకువ లేచి పోయి బురుజుల సంరక్షించు చుండుఁడు.

మంత్రి—అయేర్పాటంతయును జేసెదను స్వామీ!

రంగా—ఇప్పుడే బొబ్బిలిరాజ్యమున వెంగళ్రాయునికిఁ బట్టము గట్టి యుద్ధమునకుఁ బోయెదను సచివా! సమస్తమంగళద్రవ్యంబులఁ దెప్పింపుము!

మంత్రి—జాగ్రత్త చేసెదను రాజేంద్రా! (అని సమస్తమును దెప్పించు చున్నాఁడు.)

రంగా—వెంగళ్రాయుని సింహాసనంబున దునిచి,

గీ. ధరణి నేలెద వాచంద్రతారకముగ। రిపుల నోరిచి తమ్ముఁడా! విపులకీర్తి
నందుఁ గావుత రావువంశాంబురాశి। నీదురాజత్వమహిమచే నిక్కువముగ.

(అని యాశీర్వదించి యక్షతలఁ జల్లు చున్నాఁడు.)

వెంగ—(కన్నుల నీరు నిండ) అన్నగారూ! మీ రిట్లేల చేసితిరి?



గీ. అన్న నీ విట్లు చేయుట యదియ మంగళముగఁ దోఁచెడి నా కిప్పు సమయమునకు
నీదుపజ్జనె చనుదెంతు నిశ్చయముగ। రాజటంచును నన్నిడ రాదు సుమ్ము.

రంగా—తమ్ముఁడా! రాజు సంగరంబున కరుగుతఱి సింహాసనంబున నేరి నైన నునిచి పోవలె. అట్టిద రాజనీతి గనుక నిట్లుఁ జేసినాఁడఁ గాని సంగ్రామరంగంబున భంగం బగు నని మదిఁ గలంగి కాదు సుమీ.

వెంగ—అట్లయిన సరే. (అని కన్నీరుఁ దుడుచుకొను చున్నాఁడు)

రంగా—సేవకా! చినరంగారావు నిటుల నెత్తుకొని రమ్ము.

సేవ—చిత్తము స్వామీ! (అని పోయి తీసికొని వచ్చు చున్నాఁడు)

రంగా—(పిల్లవాని నెత్తుకొని) తమ్ముఁడా వెంగళ్రాయఁడా! ఈపిల్లవానిని నీయధీనము సేయు చున్నవాఁడ. వీనిని నీయన్నగా భావింపుము.

వెంగ—దుఃఖ మాపుకొనలేక దుఃఖించుచు,

గీ. అన్నగా రని యాపిన్నయన్న నెంచ। నేల యన్నయ్య? నీ కేమి యొగ్గు గలుగు
యుద్ధమందున? నట్లైన నుర్వియేల?। రాజ్య మేలయ్య? నాకిట్టిప్రాణ మేల?

రంగా—తమ్ముఁడా! సంగరంబున జయాపజయంబులు దైవాధీనంబులు గదా. ఎటు వచ్చి యెటు పోవునో! యని యిట్లు చేసితి. విరుద్ధ మేమి?

(అని వెంగళ్రాయునిపై మంగాళాక్షతలఁ జల్లు చున్నాడు.)

మంత్రివరా! నే నిదే యుద్ధమునకుఁ బోవు చున్నాఁడ.

(రంగారావుపై దేవతలు పుష్పవృష్టిఁ గురియు చున్నారు.)

ఆకాశవాణి (బాపురే! భూమియందు రంగారావే వీరుఁడు. జగద్వ్యాప్రాంతకీర్తిఁ బడయును గాత.)

రంగా—బ్రాహ్మణుల కనేకదానంబులఁ జేయు చున్నాఁడు.

(అందఱు నిష్క్రమించు చున్నారు.)





శ్రీ

# రంగారాయకదన సమాచారము.

## తృతీయాంకము.

### విష్కంభము.

[నాగోజీరావు లక్ష్మన్న ప్రవేశించుచున్నారు.]

నాగో—లక్ష్మన్నగారూ! వింటిరా రాత్రిసమాచారము? హసనల్లీఖానుఁడు రంగారావుసన్నిధానంబునకేఁగి తనమాటలయందు నమ్మకము పుట్టించి తనపంపుఁ జేయింప నెంచి యసంగతంబగు నాత్మీయకులదూషణంబు నరాతికులభూషణంబును గావించి నిజము పుట్టిపడునట్లు నటించి పోరిల్వీడి యేగుమని యనేకవిధంబుల వాకొన్న నారాజు కోట వదలనని నౌబత్తు మ్రోగింప మానవని యన్యాయంబుగఁ బైకెత్తి వచ్చినఁ బ్రాణములైనఁ గోల్పోవ నిశ్చయించుకొన్నారమని వర్తమానమంపఁగ హైదరుజంగ్ దైవిలాసకాలదహనునిభంగి మండిపడుచు వారి నీక్షణమునఁ బోరిలఁ బైకెత్తిపోయెదనని గర్జిలు చేయుచుండఁగా నెంత ధైర్యశాలియో గాని మనహసనల్లీ యెదుర్కొని హైదరుతో "ఇట్లు నీతిలేక మాట్లాడుట న్యాయంబు గాదు. అడిగినంత పైకంబీయమని యనిరా? రావువారు దివాణముపైనయము దప్పి ప్రవర్తించిరా? రాజు దుర్భోధనచే మీరిట్టిదుర్నయమున కొడిగట్టికొనుట న్యాయంబు గాదు. రావువారభిమానధనులు. శౌర్యాన్వితులు. అపైని నిరపరాధులు. వారిపై నిష్కారణము దండెత్తుట లధికారమదోన్మత్తతావిశేషములు గాని వేఱు గావు. తప్పులేనివారిపైఁ దప్పు గల్పించి సమరంబు సేయ నెంచితిరి. వారెందఱిని మట్టుపెట్టెదరో యోజింపుఁడు. తాతలనాఁటినుండి గ్రామము వదలక కనిపెట్టుకొని శిశుబాలవృద్ధులతోఁ గాపురమున్నవారికొంపలకగ్గి ముట్టింప నెంచితిరి గదా! అపైని ఖోదా మిమ్మెట్లు చేయనున్నాఁడో? ఎదిరిచావును దమచావు నెఱుంగక పోరు రావువారల నెదుర్కొని వెళ్లులు గలరా? ఆబుస్సీ యొట్లికొనె. ఒప్పుదైన ధర్మంబు దప్పక నడచుట మంచిది. అడిగినంతధనము నిచ్చు మన్నించుచుండ వారిని జంప నుంకించుట,



మిక్కిలి పాపకృత్యము. ఆపాపము మనలఁ గట్టికుడుపక పోదు. న్యాయము చెప్పితిని. మీ రేమి చేసినను సరే" యని యనేకవిధంబుల నధికారి యని యింతయు సందేహింపక మిగులధైర్యముతో వాక్రువ్వ వాఁడలిగి ఖానునిమాటలు లక్ష్యము సేయక వానిం జేయునదేమియు లేక బుస్సీతో రహస్యమున మచ్చటించి బొబ్బిలిరాజుపైఁ గొండెములు నూరిపోసి యెట్టకేలకు యుద్ధమునకు సెలవిచ్చునట్లు చేసె. బుస్సీయు నుదయముననే సమరంబునకుఁ గడంగుఁడని యాజ్ఞ యొసఁగె. ఇదియ సమాచారము. మనమును యుద్ధసన్నద్ధులమై పోవలెను. పదపద సమస్తము దైవాధీనము గాని మనవలన నయ్యెడున దేమియు లేదు. కాని యెట్లు జరుగునో చూతము.

(అని నిష్క్రమించుచున్నారు.)

### ప్రదేశము.—యుద్ధరంగము.

(ఉదయముననే యిరువాగుసేనలు నెదురుగ దార్కొనఁగా)

హైద—లాంసూ! మీసైన్యముతోఁ బోయి బురుజుల స్వాధీనము చేసికొనుము. వీరభటులారా! మీధైర్యంబులఁ జూపుటకిదే సమయము.

భటు—ఖాన్వర్యా! మాకు రంగారావన నెంతటివాఁడు? ఇదే పోవుచున్నాము.

రంగా—వెంగళ్రాయఁడా! మీరంద ఱెచ్చట నున్నారు?

వెంగ—మహాప్రభూ! మేము తక్కినమూఁడుబురుజులమీఁద నున్నారము. కొంతమంది కోటక్రింద సమరంబునకుఁ దూగియున్నారు.

రంగా—మంచిది. జాగ్రత్తగ నుండుఁడు.

(రణభేరి మ్రోగుచున్నది. యుద్ధమారంభించుట ఘంటానాదము ప్రవర్తించుచున్నది.)

(రంగారావు లాడూఖానుల యుద్ధము.)

లాడూ—మాతో నేల బోరెదవు? ప్రాణములపై యాశ లేదా? నీవా మమ్ములను గెల్చువాఁడవు?

రంగా—శా. ఓరీ మూఢుఁడ! క్రూరచిత్త! విను జన్యోర్వీస్థలిం బోరి నీ
దారాపుత్రులు శోకమందమడియం దర్పించుచున్నావు రం
గారాయోగ్ర నిశాతమార్గణభుజంగం బేర్చి యుగ్రాకృతిం
గోరల్ గ్రోలుచునున్న దప్పు డిదిగో గ్రోలున్ భవత్ప్రాణముల్.

లాడు—వట్టిదంభముల నేల ప్రేలెదవు? చూతువు గాని నాశక్తి. (అని తుపాకీ కాల్చుచున్నాఁడు.)

రంగా—తప్పించుకొని వానిపై బాణవృష్టిఁ గురియించు చున్నాఁడు.

(లాడూ మృతి. పారసీక సేనా కలకలము.)

సైని—(హైదరువద్దకిఁ బోయి) మహాప్రభూ! మనలాడూఖాను రంగారాయని నిశిత బాణపరంపరల కోర్వఁజాలక కాలధర్మంబు నొందె. తత్సైనికులును గాందిశీకులైరి. ఏమి సెలవు?

హైద—సీ. ఓడెఁగా లాడు! రంగరాయోగ్రనిహతి
లాసూ! నీ వేఁగి తత్క్షణంబ రిపుల నోర్చి విజయంబుఁ జేకూర్పుము.
నీవు గలుగఁగ నాకిల నిర్భయంబు
మున్ను జరిగిన యుద్ధములలో నీవలననే కదా మాకు జయంబు చేకూరె.
రంగరావెంత నీకు సంగ్రామసీమ
జయము గైకొని రమ్ము నీ జసము మెఱయ.

లాసూ—అదెంతపని? చూడుము నాబలము. (అని పోవుట.)

(రంగారావు లాసూఖానుల యుద్ధము.)

లాసూ—గీ. లాడుఁ జంపితి నంచు నీవాడఁ బోరు
పంబెదే? న న్గెల్వు మింక నీశక్తి తెలియు.

రంగా—గంతు గొనియెదు నా కాండకాండములను
నిల్చిపోరుము నాతోడ నిముష మిచట.

లాసూ—ఏమిడంబములు! ఏదీ! నిలువఁబడితి. చూపుము నీశక్తి?

రంగా—ఓరి పారసీకాధమా! నీకుఁ గాలావసానం బగుటనే నాతో యుద్ధంబు సంభవమైనది ఇదే కాచుకొనుము. (అని బాణమును వదలు చున్నాఁడు.)

లాసూ—సైనికులారా! బురుజెక్కుఁడు. ఎక్కుఁడు. ఇదే సమయము. పైనుంచి యీరా జపరిమితకాండముల నేయు చున్నాఁడు. ఎక్కినంగాని వీని మట్టుపెట్టఁ జాలము.

సైని—ఎక్కు చున్నాము. ఎక్కు చున్నాము. (అని యెగఁ బ్రాకు చున్నారు.)
(రంగారావు బాణములచేఁ గొందఱు నేలఁ గూలు చున్నారు.)
లాసూ! ఎక్కడ నున్నావు? నీ వెక్కవేమి?

లాసూ—ఇదే నేనును వచ్చు చున్నాఁడ. (అని సైనికునిభుజములపైఁ గాల్లు వైచి యెక్కుచు రంగారావు బాణహతిచే నేలఁ గూలు చున్నాఁడు.)



సైని—(హాహాకారంబులు సెలంగ హైదరుం జేరి) సాహేబా! సైన్య మంతయు నంతంబు నొందె. లాసు గతాసుం డయ్యె. ఇం కేమిసేయుదు మయ్యా?

హైద—పీహాషుకురల్లీఖాన్! సిద్దీబిలాల్! జానుఖాన్! హసనల్లీఖాన్! ఏల చూచెదరు? లాడూలాసులను మట్టుపెట్టి రంగారావుక్కుమిగిలి యున్నాఁడట. ఈక్షణము మీ రేఁగి యాశూరుని బరిమార్చి రండు.

షుకు—తమ సెలవుకొఱకు నిరీక్షించు చుంటిమి గాని యి దెంతపని? (అని రంగారావు నెదుర్కొను చున్నాఁడు.)

రంగా—
గీ. ఔర! నెయ్యుఁగ లాడుఖానాళిఁ గూడఁ। బోవ నున్నాఁడవే? భళీ! నీవ స్నేహి
తుండ వన్నఁ బోని స్మరదుర మదీయ। యాజవంజవబాణౌఘ మనుచు నటకు.
ఇదే మదీయాశుగము ప్రవర్తిల్లెడిని- (అని వదలు చున్నాఁడు.)

షుకు—లాడూజానూ లనుకొంటి నేమో? కాదు సుమా. నేను షుకురల్లీఖానుండను. జాగ్రత్త. (అని యొకతుపాకీని గాల్చు చున్నాఁడు.)

రంగా—(తప్పించుకొని మూఁడుబాణముల నేయు చున్నాఁడు.)

షుకు—బిలాల్! రా వేమి? జానూ! ఎక్క వేమి? హసనల్లీ! చూచెద వేల?

జానూ—ఎక్కుచున్నాము గాని,
క. పైనుండి దేహ మెఱియఁగఁ। గోణంబున నిల్చి రాజు కోపోద్దీప్తిన్
బాణానలంబు గురియఁగల। బ్రాణంబులఁ జిక్కఁబట్టి ప్రాకఁగ నెట్లౌ!
కానీ! ఏ మానో? ఎక్కి వచ్చు చున్నాము.

రంగా—ఉగ్రుఁడై,
శా. ఓరి! మిమ్ముల నెక్క నిత్తునె? గడీ నోహో! యముం జేరి మీ
వీరాలాపము లుగ్గడించి వరము ల్వేఁ బొందిరం డిమ్ముల౯.
(అనుచు నిస్త్రింశత్రియ మూకొని వారివెడందయురములపై గురికొని యేయు నేలఁ గూలుచు.)

బిలాల్—ఓరంగా వని భర్త! చంపితివె మమ్ము గ్రాశుగౌఘంబుచే
దారాపుత్రుల కేమి దిక్కుఁక ఖోదా! ధాతేరియినల్లానబీ.
(అని ప్రాణములు వదలు చున్నాఁడు. ఈకేకలు విని సైనికు లొక్కుమ్మడిఁ బెగువఁ దెచ్చుకొని పైకెగఁ బ్రాకు చున్నారు)

బుస్సీ—యోధవీరులారా! ఘటికాద్వితయంబు కాలంబు సమరంబు చాలింపుఁడు.

అందఱు నాయుధముల నేలవైచి శ్రమలఁ దీర్చుకొనుచున్నారు.)

రంగా—(తొందరతో) ఆహా! నలుమొగంబులం దురకలు దండోపదండంబులుగ నగరంబ్రాకి పై కెక్కుచున్నారు. అదె కొంతసైన్య మిదివరకె యెక్కి వచ్చె. ఓహో వెంకయ్యగారూ! వెంగళ్రాయుఁడా! దమ్మన్నగారూ! ఎక్కడనున్నారు? వేగ మిటు రండు.

వెంక— ఏమి సెలవు? అందఱ మిక్కడనే యున్నాము.

రంగా—వీరు లగ్గల కెగఁబ్రాకిరి. వీరి నొంచుట శక్యముగాఁ గన్పించుట లేదు. అందఱు నెక్కి రా కోటఁ దీసికొన్నవారే. కోట పోయెనా వైరిరాజు దుర్వృత్తి వల్లనైన నేమి? మ ఱేకారణమువల్లనైన నేమి స్త్రీల నమానుష పఱతురుగాన.

గీ. ప్రాణములకంటె నెక్కుడు పౌరుషంబు । గాన శుద్ధాంతకాంతల మానుషమ్ము
నిల్పఁగా సాధనం బీరు నేర్పు మీఱఁ । జెప్పు డిప్పుడ లేకున్నఁ జేటు పుట్టు.

వెంగ—అన్నా! మునుమున్న వారియభిప్రాయం బెఱింగి తదనుకూలముగఁ బ్రవర్తిల్లుట మన కావశ్యకమై యుండ నిప్పు డాలోచన కేమున్నది.

గీ. సంభవించెను మనలకు సంఘమరణ
కాల మిప్పుడ శంకింప నేల యన్న!

రంగా— నిత్య మది తమ్ముఁడా! యింక సంశయింప
నేల కృతనిశ్చయుఁడ నైతి నింక నేను.

చెలికాని వెంకయ్యా? కోటబురుజులపై వేనవేలు యవనులు పారసీకు లెక్కి నాదిక్కున కదె వచ్చుచున్నారటు చూడుము. మనము యుద్ధము దిరిగి ప్రారంభము సేయునంతలో వీరందఱును పైకి వచ్చెదరు గాన నీవు తత్క్షణం బేగి శుద్ధాంతకాంతల సబంధుమిత్రంబుగ శిశుబాలవృద్ధులతోఁ గరవాలనికృత్తకంఠల నొనర్చి వేగ రమ్ము. ఆలోచించినం బ్రయోజనము లేదు. త్వరగాఁ బొమ్ము.

(తెర పడుచున్నది.)

వెంక—(కత్తి దీసికొని పరుగెత్తుచున్నసమయంబున సైన్యభూమి కంప మొందుచున్నది. తారలు దుర్గి నేల వ్రాలుచున్నవి.) (తనలో) ఆహా! దైవమా! ఎట్టి పాపిష్టిజన్మ మెత్తితిని? ఎట్టిపాపకృత్యము నావంతు సేసితివి? మున్నెన్ని దుష్కృ



తంబొనర్చితినో గదా! కేవలము కటికివానిపనికంటె నెక్కుడు పాపకార్య మొనర్పవలసి వచ్చినదే? ఇట్టిపనికి ముజ్జగంబులఁ దగినవారు లేక నన్నారసితివా?

శా. ఆహా! దైవమ! యెట్లు చంపుదును నే నంతఃపుర స్త్రీ తతిన్
బాహాసిన్ హరిణాంకబింబముఖులన్ బద్మాక్షులన్ బాపము
త్స్నేహం బెంతయు మీఱ నుండు నిజపాతివ్రత్యముం బోలె స
ద్గేహం బందున నుండు వారి కెటులన్ గీడెంతు నే నక్కటా!

గీ. ఆడువారిని జంపుట కూడదంచుఁ । దెలిసి యపకృత్యముం జేయవలసె నాకు
ఇట్టిపాపిష్ఠికార్యంబు నెఱపుకొఱకె । జన్మ మెత్తితి గాఁబోలు జగతి యందు.

ఇందుకై సిద్ధముగా నున్న యీబాహువును ఖండించుకొనిన బాగుగ నుండును. (అని తెగవేసికొనఁ బోవుచున్నాఁడు.)

కంచుకి—(చేయిఁ బట్టుకొని) వలదు వలదు. ధైర్య మూనుము. (అని యాపుచున్నాఁడు.)

వెంక—ఛీ! భార్య యనక బిడ్డ లనక రాణి యనక స్త్రీ లనక వృద్ధులనక యందఱిని జంపుట కెట్లు చేయి వచ్చును? హా! దైవమా!

ఉ. ఎంతటివాఁడవైన నగు దీని కిదైవము! నీదు చేతలన్
వింతలు ముజ్జగంబున, దివిన్ భువి నీతలకిందు సేయు సా
మాంతము మెచ్చవచ్చును సుమా యపరాధము లేనివెల్మస్త్రీ
లొంతులఁ బెట్టుకాయపడిఁ ద్రుంచెడునట్టులఁ జేయ నెంచితే?

(అని గోలుగోలున నేడ్చుచు వెంకయ్య రాణివాసంబున కరుగుచున్నాఁడు.)

ప్రదేశము — రాణివాసము.

[మల్లమ్మాదేవి, కుమారుఁడు, దాది ప్రవేశించుచున్నారు.]

మల్లమ్మ—ఆహా! దైవప్రేరేపణ! దైవ మొసంగినపదవితో సంతసించి చిరకాలము నుంచి కాలము గడుపుచున్న యీవెలమవంగసమున కెట్టిమహాపద సంప్రాప్తమైనది! అధికారుల ధిక్కరించినవారి కిక్కట్టులు పుట్టుటయు నైసర్గికమె. శత్రురాజులు జయకాంక్ష నెదిరి పోరుటయుఁ బౌరుషమే. కొండెములు విని యధికారు లిట్టియధర్మయుద్ధములకు సిద్ధమగు టెచ్చటను విని కని యుండలేదు. న్యాయము దైవమే యెఱుంగు అని యట్లుండ మీఁదుమిక్కిలి వెలమవనితలఁ జెఱబట్టి విజయమ్మార్గమ్మున జూహించుచున్నాఁడఁట. ఇదెట్టిధర్మము? ఆపజ.

యము రానీ రాజ్యము పోనీ వెలమవారు ప్రాణముకంటె మానమునె యెక్కుడుగఁ దలంతు రని రాజెఱుంగఁడు గాఁబోలు. ఏమిది! కుడికన్ను దరుచున్నది. దైవ మిఁకమలఁ గుడుప నున్నాఁడా యేమి? ఈ యశుభసూచన లింతకంటె నెక్కుడుగ నిదివఱకే కన్పట్టుచు వచ్చినవి.

సీ. కాంతిహీనంబులై కన్పట్టు సౌధము లతిచిత్రరాగనిర్మితము లయ్యు
నిర్జనంబుగఁ దోఁచు నిఖిలగోపురోచ్ఛ్రయ మమితజనాకీర్ణ మైన దయ్యుఁ
గారాగృహంబులకరణిఁ దోఁచెడు స్వేచ్ఛఁ జరియించు రాణివాసంబు లయ్యు
నొంటిదాన నటంచు నులికిపాటుం దోఁచు నాతతబంధుసమేత నయ్యు
స్థిమిత మంతయు నశియించెఁ జిత్తమునకు । లేశమైనను సౌఖ్యంబు లేక యుంటి
భువిని త్రైలోక్యశూరుఁడౌ బొబ్బిలిపుర । రాజితైశ్వర్యసుత్రాము రాణి నయ్యు.

ఇట్టిదురవస్థ లెన్నఁడును బొంది యుండ లేదు.

సీ. డెందంబు దిగులును బొందు నంతట భీతిఁ జెందుఁ జాంచల్యంబుఁ జిందు చూడఁ
గడు నధైర్యంబునఁ గ్రాలును వెంటనే ప్రాణ మేగు నటంచు భ్రాంతి పుట్టు
నొంటిగా నుండుట కొల్లక పదిమంది యున్నట్టిచోటున కురుకఁ జూచు
దీప ముండినఁ దోఁచుఁ దిమిరం బటంచును రెప్ప విప్పినఁ ద్రిప్పు దుప్పటిల్లు
నేమియును దోఁచదు పరాకు హెచ్చుచుండుఁ । బిచ్చిపట్టు నటంచును బిరికితనము
వొడము నెడనెడబడలిక యొడల నడలెఁ । బొడముఁ గారణమెద్దియో బోధపడదు.
కాల మొక్కరీతిగఁ గడుప నెంతటివారికి నశక్యంబు గదా! ఇంతే గాక.

సీ. దారి కాన్పింపదు భూరికవాటము ల్తెఱచి యున్నను గను ల్తెఱచి యున్న
మాట విన్పింపదు మగువలు దరిఁ జేరి బిట్టార్చుచున్న మే ల్వీను లున్న
రుచి కనిపింపదు రుచిరాన్నపానాదిరసము లున్నను మంచిరసన యున్న
వాసన తెలియదు ప్రసవపరిభూతసుగంధ మున్నను ఘనఘ్రాణ మున్న
సుఖము తోఁచదు సుకుమారశోభితాంగ । మున్న మెత్తనిపాన్పు లున్న నహహ!
యింద్రియము లెల్లు మాఱెనో యింతలోన । నేమిదురవస్థలొదవునో యింకమీఁద.

నాలోనియవస్థ లిట్లున్నవి. ఇది యని పైకిఁ దెల్పుడు సేయఁజాలని వ్యాకులము డెందము బావరించినది. లోనసే గాదు.

సీ. మొగమునఁ గళకాంతి పూజ్యమై కన్పట్టెఁ జూడ స్త్రీపురుషులఁ జోద్యముగను
జనసత్త్వ మాఱు లేనిబాధ్యునఁ గన్పట్టె గజతురగాళి నిష్కారణముగఁ



బీనుఁగు వోయిన పేరిల్లు కైవడిఁ దోఁచెడుఁ గోట యవాచకముగ
టెక్కెముల్ నేలపై నొక్కసారిగఁ గూలెఁ దారలు రాలెను ధరణి యదరె
నిట్టియపశకునంబుల నెంచిచూడ । భీమరణరంగమందు నాప్రియున కెట్టి
చెట్ట వాటిల్లెనో యనుచింత వొడము । నకట నే నేమి సేయుదు నాఁడుదాన.

సీ. నరులార! యక్షకిన్నరులార! సురలార! చేరి నా నాథు రక్షింప రయ్య!
తరులార! భూసురోత్తరులార! వరులార! చేరి నా నాథు రక్షింప రయ్య!
చరులార! నిరతఖేచరులార! గురులార! చేరి నా నాథు రక్షింప రయ్య!
కరులార! శీతోష్ణకరులార హరులార! చేరి నా నాథు రక్షింప రయ్య!
తారకములార! వరపయోధరములార! భూధరములార! బహుపుణ్యభూములార!
విషధరములార! యోషధీవితతులార! చేరి నా నాథు నాజి రక్షింప రయ్య!

(ఈరీతిని మల్లమ్మాదేవి విచారించుచుండఁగా వెంకయ్య ప్రవేశించి మల్లమ్మాదేవిని దూరమునఁ జూచి)

వెంక — ఉ. మల్లమదేవి! సర్వజనమాన్యచరిత్ర! సుశీల! సాధ్వి! సం
పల్లలితాంగి! దీనజనపాలకకల్పకవల్లి లోకులన్
జల్లనిచూపు చూచు విల సత్కృప గల్గినతల్లి నీక యి
బ్బల్లి! పొసంగు టిట్టిదురవస్థ! యి దెక్కడికర్మ మక్కటా!

(అని యేడ్చుచు వెంకయ్య మల్లమ్మను సమీపించుచున్నాఁడు.)

మల్ల — (తనలో) నే ననుకొనుచున్నట్లే జరుగ నోపు. (ప్రకాశముగా) తమ్ముఁడా! వెంకయ్యా! ఏమిది! ఏల పలపల నీటుల నిలపించుచున్నావు?

వెంక — ఉ. మల్లమదేవి! (అని తిరిగి చదువును.) అమ్మా! సోదరీ! యెంతక్రూరకృత్యము రాజు నాపాలఁ బెట్టె. నేఁటితో వెలమకులం బంతరించుకాలంబు వచ్చినది. ఏమి చెప్పుదు. తల్లీ! నోరు రాకున్నది.

మల్ల — తమ్ముఁడా! వెంకయ్యా! నాకుం బొడకట్టినది. జీవితాశ లేకయే రాజిట్లాజ్ఞాపించి యుండ నోపు. హా నాథా! వీరబొబ్బిలిశౌర్యాకారా! వీరాధివీరా! (అని నేల వ్రాలుచున్నది.)

వెంక — అమ్మా! నీ వాలోచించినది నిక్కువమే గాని యిప్పుడే తొందఱపడ నవసరము లేదు

మల్ల — (లేచి) అగును. నేనే ముందు లోకాంతరముం గూర్చి పోవనై యుండఁగా విచారించు టేల? వెంకయ్యా! నీవు వచ్చినపనియుం దెలిసినది. శేషువార్తలు

సెవినిఁ బడకుండఁగ నీచేతికత్తి నా కొక్కసారి యిమ్ము. (లాగి పుచ్చుకొని చెంతనున్న దాదిం జూచి) దాదీ! యీపిల్లవానిం గొంపోయి సామర్లకోటలోఁ బిన తల్లివద్ద దిగ విడిచి రమ్ము. పిల్లవానిం జూచి హా ముద్దులకుఱ్ఱా! చిన్ననాఁటినుండి యింతవఱకు పావలనఁ బెరిగితివి. ఇంక నీకుఁ బాలియ్య నోచనైతి నాతండ్రీ! నీజనకుండు రణరంగంబునం గల్గినయధైర్యముచే శుద్ధాంతకాంతల నా బాలగోపాలమ్మును జంపు మని యిచటే పంపి యున్నాఁడు. అమానుషముకంటె నే మరణించుటయే మంచిది. కాని,

శా. కట్టా! ముద్దులపట్టి! చెట్టచెఱుగు ల్గానంగ లే కున్న ని
న్నెట్టీపట్టున డించి పోయెదను? నీ కే దిక్కు? ఇం కెవ్వ రి
క్కట్టుల్ దీర్చెదు? రేమి సేయుదు? నిదే కర్మంబొ నీపాలికిం
బుట్టెన్ దైవముకంటె కింతబరువైపోతే కుమారోత్తమా!

ఇంకను యువరాజ్యపట్టాభిషేకముఁ బొందెదవు. బొబ్బిలి నేలెద వనుకొంటింగాని దాదికొప్పగించి ప్రాణముల దక్కింతు నని యనుకొన లేదు. హా పుత్రా! హా భాగ్యరాశీ!

ఉ. అెక్కలు రావు ఆకలి నెఱింగెడివాఁడవు గావు. మిక్కిలిన్
బొక్కెడు తల్లి యొక్కక్షణము న్గనిపింపనిపట్ల. బిడ్డ! యిం
కొక్కెడఁ బ్రాలు ద్రావ, నెటు లుండెద, వెవ్వరు పెంచువారు, ని
న్నక్కట దిక్కుమాలినదు రాగతుఁ జేసెనె? దైవ మిత్తఱిన్.

హా ముద్దులకుమారా! తల్లిలే కెంత తపించెదవో. పాలులే కెంత పొగిలెదవో. హా కుమారా! ఈశ్వరుఁడు నీయెడల నెంతదారుణము వహించెనురా! కన్నబిడ్డా! చిన్నపుత్రా! చినరంగారాయా!

ఉ. చిన్నికుమార! వెల్మకులశేఖర! యో చినరంగరాయ! మా
యన్న! యనుంగుఁగుఱ్ఱ! లసదాననిర్జితచంద్రబింబ! వి
ద్వన్నుతధైర్యధుర్య! సముదారగుణోదయ! తండ్రి! యేలరా!
చిన్నతనంబునందె వలుచిక్కులపా లయిపోతి వయ్యయో!

నా వంటినిర్భాగ్యురాలికి నిన్నుఁ జూచి యానందించుభాగ్య మెక్కడిది? దిక్కుమాలినపక్షి నైతివే? (అని పలుమాఱు మూర్ధాఘ్రాణ మొనర్చును)

ఉ. మామకశత్రుసంతతి యమానుషము న్గని చావ బుద్ధి యా
నీమొగము న్గమంగొనిన నిక్కము చాఁగ బుద్ధి పుట్టె దిం



కేమి యొనర్చుదాన విధి యెట్టులఁ జేయఁగ నున్నవాఁడొ? నిన్
భూమిని నొంటిగా విడిచి పోవుచు నుంటిని బుత్రి! నిర్దయన్.

సీ. ఆకలి యైనప్పు డమ్మా యటంచు నాకొఱ కెంత యేడ్చెదో కూర్మితనయ
ఆపద ల్వాడమ నబ్బా యటంచును దండ్రికొఱ కెంత పొగిలెదో చిఱుతవాఁడ
ఈడువారలఁ జూచి యెంతలు వేఁడుకఁ బొందెదో మాకుఁగా ముద్దుబిడ్డ
తల్లిదగ్గర లేనిదైన్యంబుచే నెంత యడలెదో నన్గూర్చి బుడుతవాఁడ.
ఘోర పని మించె దైవ మిట్లని విధించెఁ బగను మది నుంచె నింత లాపదల ముంచె
నరిని వెలయించె మనలఁ బోనాడ నెంచె! నకటకట విధి నే మని యనెడిదాన.

కుమారా! నీదైన్యస్థితిఁ దలంచుకొనిన నాగుండె చెఱువగుచున్నది. పసిబిడ్డా! నేను లోకాంతరము నొందుచుంటిని గాన నేరికై చింతింపఁజాల. నాకొరకు జన్మాంతము నీవెట్టి వగలఁ బొగిలెదవో గదా! చిఱుతకాఱున నీ కెట్టియిక్కట్టులఁ బెట్టెరా కట్టడిదైవము! ముద్దులపట్టీ! వెల్మవంశం బుద్ధరింపఁ బుట్టితి వని నీవు జన్మించినతఱిఁ గడుఁ బొగడి నభూసురవరసామంతరాజన్యపుంగవులనుడువుల గడగునా? ఒక్కనాఁటికిఁ గానేరవు. కుమారా! చినరంగారాయా! తండ్రి శౌర్యము నిలువఁ బెట్టుము. తొల్లి శ్రీరామచంద్రుం డడవికిఁ జను చున్నతఱిఁ గౌసల్యామహాదేవి తనతనయున కిచ్చినదీవనలే నీ కగుఁ గాత. తొల్లి తల్లిచెరఁ బాప నమృతంబునకై మహేంద్రపట్టణంబునకుఁ జనునప్పుడు వైన తేయునకు వినతా మహాదేవి యొసంగినవరములే నీకును మేలొనగూర్చుఁ గాక. సవతితల్లిచేఁ బెక్కిక్కట్టులం బడి ధ్రువుం డడవికిఁ జనుతఱిఁ దల్లి యాబాలున కిచ్చినయాశీర్వచనములే ని న్నోముఁ గాక. సూర్యచంద్రాదిగ్రహంబులు గగనంబులుఁ ద్రికాలసంధ్యలుఁ ద్రిమూర్తులు ని న్నాచంద్రార్కము రక్షింతురు గాక. ఇఁకొకసారి ము ద్దిమ్ము. హా తనయా! హా కోటిసూర్యప్రకాశా! హా నుకుమారా! హా బొబ్బిలిశౌర్యాకారా! హా పసిబిడ్డా!

ఉ. కాలముఁ దీర్చఁగా వశమె? కన్నులనిండఁగఁ గన్నబిడ్డ! నీ
మేలును గాంచి మోదమున మించెడిప్రాప్తము లేదు నాకిఁకన్
బాలక! చాలవృద్ధి గని పౌరుషకీర్తులఁ జెంది లోకముం
బాలనఁ జేయు మీ వయినఁ బ్రస్తుతి సేయఁగఁ బెద్దకాలమున్.

(అని పిల్లవానిని దాది కిచ్చు చున్నది.) దాదీ! బహుజాగ్రత్తగఁ దీసికొని పొమ్ము. ఇంకొక్కమాట వినుము.

సీ. కపివాఁడు గడుముక్కు పచ్చలారనివాఁడు ప్రేముడితోడను బెనుచు మనుము
పాలు నీడనివాఁడు బాలుఁడు సుకుమారి పెనుదయతోడుత మనుచు మనుము
తల్లిఁ గోల్పోయినపిల్లవాఁడిఁక బెంగఁగొనకుండఁ జనువునఁ దనుపు మనుము
మారాము వెట్టఁగ మమతఁ బాయక విసు వొందక జాలిని బొందు మనుము
వాఁడు కొమరుఁడు గాఁడింక నీకొమరుఁడు గాని యని నాదుమాటగాఁ గరమునచ్చఁ
జెప్పి చెల్లెలిచేత నీచిఱుత నుంచి రమ్ము వెసఁ బొమ్ము చేకొమ్ము రమ్ము నందు.

దాది—అమ్మా ! అట్లనేచేతు. నీబాలున కొవంతయు హానిరాకుండ నొప్పగించివత్తు.

మల్ల—ఇట నీ వున్నంతసేవు నాబుడుతపై మమత నేఁ బాయఁ జాల. వేగఁ బొమ్ము. ఇట్టియాపత్సమయంబునఁ జేసినయుపకారమే యుపకారము. శత్రువులకంటఁ బడనీయక యుక్తిచే నీవీడు గడపి కొంపొమ్ము. ఆపిల్లవాఁడు దీర్ఘాయుష్మంతుఁడై పెరుగునేని నీమేలు మఱువండు. ఇఁక పొమ్ము.

దాది—మంచి దమ్మా. నేను పోయి వత్తు. (వెడలి పోవు చున్నది.)

మల్ల—తమ్ముఁడా ! నీవచ్చినపని యాలస్యమగు చున్నదా ! బొబ్బిలిబెబ్బులి యింతవఱకు సేమంబుగ నున్నవాఁడా!

వెంక—ఇంతవఱకు క్షేమముగ నున్నాఁడు తల్లీ !

మల్ల—అట్లయిన బహుధన్యురాలను. అతివలకు భూతలంబున భర్తృవియోగంబుకంటె హైన్యమును, బతికంటె ముందు సంభవించుమరణంబుకంటె భాగ్యమును లేదు. పురాకృతసుకృతపరిపాకంబునఁగాని పుణ్యస్త్రీ మరణంబు సంభవింపదు. చిరకాలము కలియుగదేవేంద్రుఁడైనరంగారాయోర్వీపతికి భార్యనైయుండి వీరబొబ్బిలికి రాణి మల్లమ్మాదేవి యని ఖ్యాతి నొంది తుదకు శత్రురాజులయమానుషంబునకు లోనుగాక చెడుమాట చెవిని బడకుండ నాభర్త సజీవుండై యుండ నేను ముందుగా స్వర్గపథంబు పట్టిపోవుటకంటె సుకృతం బేమి గలదు ? సూర్యచంద్రాదిగ్రహంబులారా ! అష్టదిక్పాలురారా ! జాయాసహితత్రిమూర్తులారా ! బొబ్బిలిపురీవాసా ! యీశా ! ఈదివసంబున వీరబొబ్బిలిరాణిమల్లమ్మాదేవి విజయరామరాజు తురకలఁగూడి యొనర్చునమానుషంబునకు వెఱచి నిశితకరవాలధారచేఁ బ్రాణంబులఁ దొఱంగు చున్నది.

ఉ. ఏను బతివ్రతామణినయేని ధరాసురభక్తిలోనఁ బెం
పూనితినేని సచ్చరిత నొంది చరించితినేని నావిభుం
డే నయశౌర్యశాలి యగునేని దురాగత మెంచినట్టిదు
ర్మానితుఁడైనయావిజయరామునివంశము భ్రంశ మొందుతన్.



(అని పొడుచుకొని భూమిపై నొఱగు చున్నది.)

(ఆకాశవాణి) "ఇమ్మహావీరపతివ్రతాశాపంబున నట్ల కాఁ గలదు. ఆధాత్రీకళత్రుండు సపుత్రమిత్రకళత్రంబుగ మల్లమ్మాదేవిశాపవశంబున మూఁడవదినంబున గంతుగొనఁ గలవాఁడు.

(ఘోరమగు కలకలము.)*

వెంక—(తక్కినవారిని జూచి) అయ్యో ! పెనుభూతము వలెనన్నట్లు చూచుచున్నారు ! (పడంకుచు నేడ్చు చున్నవారిని జూచి) హాదైవమా !

ఉ. మాటలు రానిపిల్లలను మాటికి లేపఁగ లేని పెద్దలన్
నీటులు మీటుబోటులను నిక్కపుఁబోటరి వోలెఁ జంపనే
నేటికిఁ బుట్టినాఁడ నో యీశ్వర ! యక్కటికంబు లేక యే
ప్పాటున మేకలన్ గటికివాఁడు దలల్దునుమాడు క్రైవడిన్.

మత్తకోకిల. తప్పు సేయ రెదుర్ప రెవ్వరిదౌష్ట్యమింతయు జూపరో
క్కప్పు డేనియుఁ బల్లదంబుల నాడఁ బోవరు వీరి నే
నప్పు డెట్టులఁ జంపఁ బోవుదు నీశ్వరా ! యిది యంతయున్
ముప్పుఁ దెచ్చె నమానుషంపడి పోదుమం చనుబుద్ధియే.

భార్యయుఁ బిడ్డలును వగఁ గూరి నిశ్చేతనులై యుండ

గీ. ప్రాణనాయక ! నాముద్దుబాలురార ! । నేఁటితోఁ దీఱె మీఋణం బేటి కింక

హా ! సఖీమణీ ! హాతనయులారా ! చిరకాలమునుండి మీతోడఁ గలసి మెలసి మెలఁగిన ప్రేమానుబంధము నిదె నిర్దయ యనుఖడ్గధారఁ గఠినహృదయుఁడనై తెగవ్రేయుచున్నాఁడ. నాకంటెఁ గ్రూరతముఁ డుండునా ? హాతరుణీమణీ ! పుత్రులారా !

ఇట్టిగతి మీకు వచ్చునం చెప్పుడేని । స్వప్నమందైనఁ దెలియఁగఁజాలనైతి.

(అని యందఱిని దెగవ్రేయుచున్నాఁడు.) తరువాత మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలిసి హా! మల్లమ్మాదేవీ ! పతివ్రతాశిరోమణీ ! నీవే యంతకు పాలు గాఁగ మేమందఱ మెందువ ? అంత వీరబొబ్బిలికి రాణివైయుండి ప్రాణములం దావంతయైన నాసఁ జేయక కత్తిపాలైతివే ! తల్లీ ! నీకెంతదురవస్థ దటస్థమైనది ! దైవ మింతయు నీయైశ్వర్యముం జూచి యోర్వలేక పోయెగా ? నిన్నఁటిరోజునఁ గలకలలాడు బొబ్బిలిసాలంబు నీనిమేషంబున నిర్మానుష్యంబగు శ్మశానవాటికగా మార్చితివే. నీ కెట్టియపకా

* The screen to be removed covering the corpse of the Queen with a cloth.

రం బొనర్చితిమి దైవమా ? హా ప్రారబ్ధమా ! ఎంతసేసితివి ? ఛీ ? నా బ్రతుకు కాల్పనే ! పుత్రమిత్రకళత్రబంధువర్గంబు, వందఱికంటె నెక్కుడుగ రాణిని నాశంబు నొందించి యీజన్మమును గాపాడుకొననా ? (అని తెగవేసికొనఁబోఁగా)

నౌకరు—అయ్యా ! వెంకయ్యగారూ ! రంగారావుగారిదే మిమ్ముఁ దీసికొని రమ్మనిరి. వేగ రండు.

వెంక—అయ్యారె ! అచ్చట నేమివింతలు గల్గెనో ? పోయి రాజున కీవధప్రకారంబు సెప్పి మఱి వచ్చెదను గాక. (అని రాజువద్దకుఁ బోవుచున్నాఁడు. తెరపైకిఁ బోవుచున్నది.)

రంగా—పని జరిగినదా ?

వెంక—

సీ. ఏమని వినిపింతు నీదుఃఖవార్తల నెట్టిక్రూరాత్ముఁడ నెట్టిపాపి
వీరపతివ్రత ఘోరనిజాసిచే దివి కేగెనం చెట్లు దెల్పువాఁడ
నా బాలగోపాల మక్కట నా చేత మడసిరం చెవ్విధి నుడువువాఁడ
వీరబొబ్బిలికిట్టి వికృతమౌదురవస్థ గలిగెనం చేరీతిఁ బలుకువాఁడ
నోగులో బాగు సేకూరె నొందు వినుము । వెల్మవంశాంకురము నిల్చె విశ్రుతముగఁ
బ్రబలిదీర్ఘాయువొందిమీపౌరుషయశో । ముల ధరన్నిల్పవిక్కంబు భూతలేంద్ర.

రంగా—హా దేవీ ! హా ! తనయా !

చ. అని కరుడించువేళ మిమునందఱఁ జూచిన దెంతో గాని నేఁ
గనుఁగొన నోచనైతిఁ గద కన్నులనిండఁగ, నిన్ను ! హా ! ప్రియా
మణీ ! మురిపెంపురాణి ! సుకుమార ! కుమార ! యిఁ కేమిసేతు ? నే
మని యనువాఁడ ! దైవగతి, యక్కట ! యెంతటిపాట్లు గల్గెనో !

బుస్సీ—యుద్ధము ప్రారంభము సేయుటకు సెల వొసంగు చున్నాఁడ. (అని భేరీ మ్రోగింపఁ జేయుచున్నాఁడు. అందఱును సంగరంబునకుఁ గడఁగు చున్నారు.)

అల్లీఖాన్—సుగంధి. చాలు, చాలు, బీర మింక క్షాత్రవప్రతాపముల్
డీలు సేయఁ జాలువాఁడ డీకొనుండు మమ్ములన్
గేలి గాదు పోరిలోనఁ గెలుకొన్న సైపుణిన్
గాలుద్రవ్వి యేయు చుంటిఁ గాచికొండు ప్రాణముల్.

(అని యశ్వికులసైనికులం గూడి శతఘ్నికొసంతతిం బఱపు చున్నాఁడు.)



రంగా—(విచారమును దిగమ్రింగి ధైర్యము తెచ్చుకొని క్రోధావేశుండై రెట్టించిన శౌర్యంబు మెఱుంగారిల) ఓదుష్టులారా ! చండాలులారా ! మీఫిరంగులరంగులు నే నెఱుంగుదు. వన్నేమియుం జేయఁ జాలవుగా ! నా బాణములఁ గాచికొండు. (అని యంపవానఁ గురియించు చున్నాఁడు.)

జంద్రాల్—హుస్సేనూ ! యవనపారసీకసైన్యముల నొక్కపెట్టున మ్రింగ వచ్చు మహాశక్తివలె నీతురుష్కఘరానువరూధి నీమహారణ్యంబును గాల్ప ననేకజిహ్వాలతో వచ్చుదావానలంబుకరణి నీరంగారాయఁ డొప్పారెడి. వీనితో మనము గెల్వఁ గలమా ? పోర కుంటిమా హైదరుచేతిలోఁ జావవలె. అంతకంటె నిదే మేలు. రంగారాయఁడా ! ఏల ప్రాణంబులఁ గోల్పోయెదవు ? మాశక్తి యెఱిఁగి యుండియు నిట్టివెఱ్ఱిపాలే లయ్యెదు. ఇప్పుడైన మా సేని శరణు వేఁడుము. అట్లయిన మేలగు.

రంగా—వట్టిబీరముల నేల పల్కెదవు ! ఇదె నా యాశుగంబు నీశరీరంబు ద్రెళ్ళనేయుచున్నది. (అని వదలుచున్నాఁడు.)

జంద్రా—(తప్పించుకొని) అల్లీఖానుఁడా ! రాజు కోటపైనుండి బాణాసారంబు గురియ మనపఠానులు పఠానులై నేలఁ గూలుచున్నారు. మన మెన్నిఫిరంగులఁ బఱపినను వాని నింతైన గాని చేయవు ! కానిమ్ము. మనమందఱము బురుజులపై కెక్కవలె. (అని యెక్కుచున్నారు.)

రంగా—(వారియుత్తమాంగంబుపై గురిపెట్టి హారులం బఱప జెండ్రాల్ నేలఁగూలుచున్నాఁడు.)

హుస్సేన్—ఔరా ! రాజాధమా ! నికారణంబు గావించితివి గదా! ఇఁకఁ జూడుము నాశక్తి. నిన్నింతవఱకుఁ జులుకనగా భావించుచుంటిని. ఇప్పుడ నిన్నుఁ బెద్దల సన్నిధానంబున కంపుచున్నాఁడ.

రంగా—ఓరీ ! నిన్నుద్వాసనంబు గావించినం గాని నే నేగనురా. (అని యమ్ముల వానఁ గురియింప)

హుస్సేన్—(క్రిందఁబడుచు)

శా. ఓహో సైనికులార ! గూలితిని మీ రుద్వేగులై వీనితో
బాహాబాహిని బోరి పట్టుఁ డితనిం బంధించి హింసింపుఁడో
హాహా హైదర ! దుష్టసత్త్వుఁడ నీహోదా ఘమున్ జంపెరా
ఛీ ! హీనప్రభుఁ గొల్చువానికరుదే చెట్టల్ ధరిత్రీస్థలిన్ ?

(సైనికు లామాటలు విని ధైర్యస్థైర్యంబు లినుమడింపఁ దెగువఁ దెచ్చుకొని వేనవేలభీయాతివీరవరుల ననర్గళప్రజ్ఞావిశేషంబున నొక్కుమ్మడి బురుజులపైకి నలుప్రక్కల నుండి యెక్కి సంకులసమరంబు గావించి "పట్టుఁడు! పట్టుఁడు కొట్టుఁ" డంచు బీరంబులు పల్కుచు రంగారావుం బొదివిరి.)

రంగా—ఓహో తమ్ముఁడా! వెంగళ్రాయఁడా! ఎచ్చట నున్నావు. వేగ రా! (అని కేకలు వేయుచున్నాఁడు.)

(సైనికులు వెంగళ్రావు వచ్చునంతలో రంగారావును వధియించుచున్నారు.)

(సేనాకలకలము. హాహాకారంబు లెసంగుచున్నవి.)

బుస్సీ—సైనికులారా! ఇరుదెఱఁగులవారు నింక యుద్ధంబు చాలింపుఁడు. సాయంకాలమైనది. (అందఱు నాగుచున్నారు.)

వెంగ—(సైనికులవలన రంగారావు తెఱంగెఱింగినవాఁడై పరుగెత్తుచు వచ్చి)

శా. అన్నా! పోవుచు నుంటివే దివికి? నన్నా! తమ్ముఁడా యంచు నీ
వన్నా! సోదరుఁ బిల్చు చుంటివె? తగన్ వాక్రుచ్చిపోవంగ నా?

(అని యన్నశరీరంబు జేరి సోదరుఁడు దివి కేగె నని కృతనిశ్చయుండై)

అనా! రంగనృపాలశేఖర! ధరిత్ర్యాఖండలా! శౌర్యసం
పన్నా! మమ్ముల వీడి పోయితివె! భూపా! రంగరాయాగ్రజా?

శా. అన్నా! యెన్నఁడొ వైరులం గెలిచి నీ వత్యున్నతిన్ బొబ్బిలిన్
జెన్నారంగను గన్నులారఁ గననే జేతో ముదం బందఁగా
నున్నాఁడన్ రణరంగమందుఁ బడఁగా నున్నాఁడ వం చెన్నలే
దన్నా! భారవి! యస్తమించితివె!? వప్రాస్తాద్రిపై నగ్రజా!

శా. అన్నా! సోదరవత్సలా! పురుషసింహా! ధైర్యమంధాద్రి! యో
పున్నాగా! శతభాస్కరాభ! ధరణీభూభృజ్జయా! యిప్పిరో
యన్నా! యెంతటిభాగ్యహీనుఁడను నే నన్నన్న! నానోటితో
నన్నా యంచును బిల్వ నోచ నయితిన్ హా రంగరాయాగ్రజా!

(అన్నశరీరముపై వ్రాలి)

గీ. అస్తమించెను బొబ్బిలి యస్తమించె। నవనిశూరత్వ మంతయు నస్తమించె
నవుర వెలమకులం బెల్ల నస్తమింప। రావురంగానీ నుండు ప్రతిభఁ దక్కి.

సోదరా! యీయటమటకాఁడు సేయఁబూనిన విప్రలంభనమునకు వెఱచి యీలువు గోల్పోవ శంకించచేఁ దూపిల్లి గోడాడి ప్రాణంబులఁ దొఱంగినసాధ్వియగు నీప్రియామ



ణియందుం గలమోహంబు విడనాడఁజాలక యన్యాయయుద్ధంబున మెలంగు తలంపుఁ జాలించి దివంబున కరిగితివే! మ మ్మేమి యొనర్చి పోయితివి? నీవు లేని బొబ్బిలి చంద్రుఁడు లేనిరాత్రి. జ్వాల లేనియగ్ని. జలంబులేని కాసారంబును గదా! నీ మృత్యువు విని నలుదెఱంగులఁ బోరుచున్న యోధవరులెల్లను నీకై పోరవలె నని నిజకరపరికరకరవాలంబుల నుసురులఁ దొఱంగుచున్నారు. వీరిని జూడుము. అయ్యో! చూడలేవా?

గీ. సవితృఁ డెన్నంగఁ దాఁ గర్మసాక్షి యయ్యు। నాజిలో నీవు రంగరాయాగ్రజన్మ!
తెఱుఁగఁ జూడఁగలేక నేచరమగిరికి। నరుగుచున్నాఁడు గాఁబోలు స్వరుచిఁ దొఱఁగి.

(అని దుఃఖించుచున్నాఁడు.)

దమ్మ—(చూచి) వెంగళ్రావుగారూ!

గీ. మీరె ధైర్యంబు వదలిన మీఁదికార్య। మెట్లు నెఱవేరుఁ గష్టముల్ మించుతఱి న
ధైర్యము న్వీడకుండుటయే తగవునుమ్మి। ల వినఁగా లేదె? సాహసే లక్ష్మి యనఁగ.

తమవంటి ప్రతాపఖనులే యిట్లు వెత్తిచింత పాలౌట యుచితమా?

వెంగ—(విచారించుచు) దమ్మన్నగారూ! నిజదారాపుత్రాదులు నమసినను సోదరుండు సజీవుండైనచో నాకు విచారము లేదు. అట్టియనుజన్ముండు దఱుఁగఁగ నెంత కఠినహృదయుండనో గాని ప్రాణముల విడువఁజాలనైతి.

దమ్మ—అయ్యా! ఇప్పట్ల ధైర్యము వదలుట పనిగాదు. మేమందఱ మింకను బ్రతికియుండ మీకు విచారమేల? ఎట్లయిన నాయభియాతివర్గంబు నొంచుట పౌరుషంబుగాని యీరీతిని ధైర్యంబు వోనాడుట కూడునే? భాగ్యమదేలా.

వెంగ—

క. జగదేకవీరుఁ డంచును। జగతిని బ్రఖ్యాతిఁగన్న చటులోత్తేజుం
డగుసోదరుఁడే గతియిం। పఁగ నేఁటికి భూమి నాకు?

ధర్మారా—ఊరడిల్లుము రాజా! విచారించినఁ బ్రయోజనమేమి?

వెంగ—(కొంతవడికి ధైర్యముఁ దెచ్చుకొని) ఔను. దుఃఖించి యన్నను దేఁగలనా? గతించినదానినిగుఱించి చింతించుటేల? నాశక్తికొలఁదిని బోరెదను గాక. మీరందఱును మీమీ ధైర్యంబుల నినుమడించికొని యెదిరింపుఁడు. దైవవంచనకు మన మేమి సేయఁగలము?

దమ్మ—అదియ పౌరుషము. రంగారావుగారు కాలధర్మము నొందిరి గాన గెలిచితిమని విజయరామరాజును హైదరును విఱ్ఱవీగుచున్నారు. వారిపొగ రణంచి విఖ్యాతిఁ గాంచుఁడు.

వెంగ—అటులనా? నే నున్నానని యనుకొనలేదా?

మ. అలతిం బోవఁగ నిత్తునే రిపుల? నన్యాయంబుగా నగ్రజుం
బొలియింపం బగఁ దీర్ప నే? వెఱతునే పోరంగ? భీతిల్లి బొ
బ్బిలికోటన్ విడనాడి యేగెదనె? మద్వీర్యాతిరేకంబు వ
ర్తిల నాజిన్ విమతాళిఁ గూల్పనిది యుర్విన్ బౌరుషంబే తగన్.

దమ్మ—భళీ! నీదే పౌరుషము. ఆపరశురామునిదే పౌరుషము. ఉభయసైన్యములును గోటబురుజులపై నుండుటం బట్టి బాణయుద్ధం బసంగతంబు. తూణీరకోదండకాండంబుల నొక్కెడ గుప్తంబు గావించి యగ్నియంత్రశస్త్రధారంబుగ నెదిరింతము. కా వున్న సంకులసమరంబు దప్పదు.

వెంక—అట్లనే తోఁచుచున్నది. దమ్మన్నగారూ! కుక్కుటంబులు దిక్కులు పిక్కటిలురవంబున మొరయుచుండుట విని నిశాంతం బయినట్లు తోఁచెడిని.

ధర్మా—రాజు వెడల నద్గణంబులు దేజంబు దప్పుచుండె. సజ్జనకార్యంబులకుఁ దోడ్పాటు పడుట మిత్రకృత్యం బనుకరణిఁ బ్రభాకరుండు పూర్వాశాభాగంబునఁ బొడకట్టుచుండె. మనమిఁక జన్యంబున కుద్యమించుట కర్తవ్యంబు. (అదె బుస్సీ వచ్చుచున్నాఁడు.)

బుస్సీ—యోధవీరులారా! యుద్ధంబు ప్రారంభముఁ జేయుఁడు.

[రణభేరీ మ్రోగుచున్నది. అందఱును యుద్ధమునకు
గడంగుచున్నారు.]

కుప్పి—ఓరీ! దమ్మన్నా! నీచా! హిందువా! ఇదె నాకరవాలంబు నీశిరంబుఁ ద్రెళ్ల నేయుచున్నది.

దమ్మ—ఓరీ! బుద్ధిహీనుఁడా!

ఉత్సాహ. బిరుదు లెన్నియేనిఁ బల్కు బీరమే? రణంబునన్
దిరము గాఁగ నిల్వ నాదుతీవ్రభిందివాలన
త్వరముఁ జూతు గాని యేల పారసీక ప్రేలెదా
నిరయ మొందఁ జేతు నిన్ను నీచ! చూడు మిత్తఱిన్.

(అని గుదియఁ ద్రిప్పి వైచుచున్నాఁడు. కుప్పి గూలుచున్నాఁడు.)

కుష్లాము—ఛీ! నీచేత నే మానురా. పలుయుద్ధంబులలో జయం బంది మించిన నాతోనా నీవు పోరెదవు? ఇప్పుడైనను మరలి పొమ్ము.



దమ్మ—హనుమంతునిముందట నా కుప్పిగంతు లన్నట్లు కుప్పిగంతులు వైచి గంతుగొనె ఎఱుఁగుదువా? నీపని యంతియ. మూర్ఖ! నీగర్వ మణంచెద. (అని ముద్గరంబును వైచుచున్నాఁడు.)

కుష్లా—(తప్పించుకొని పరిఘాతసంబును గిరగిరం ద్రిప్పి వాని యుత్తమాంగంబుపై వేయఁగా దమ్మన్న కూలుచున్నాఁడు.)

వెంకయ్య—నీచా! నీపొగ రిట్లున్నదిరా! (అభిగమనంబు గావించి కృపాణంబుచే వానికంఠంబుఁ దెగ నఱుకుచున్నాఁడు.)

లా—ఓరీ! నీపీఁచం బణఁగించెదఁ జూడుము. (అని కరవాలికం ద్రిప్పుచున్నాఁడు.)

వెంక—ఓరీ? పలుగాకీ! ఇదె వచ్చె. కాచుకొనుము. (ఘనంబును ఘనంబుగఁ ద్రిప్పి వైచుచున్నాడు. లా కూలుచున్నాఁడు.

రాను—నీబ్రతు కెంతరా! దుర్మార్గుఁడా! అభిషేణనంబు గావించి కుఠారంబుగైకొని గురికొని యేయుచున్నాఁడు. (వెంకయ్య నేల గూలుచున్నాఁడు.)

ధర్మా—హా దుర్మార్గుఁడా! చండాలుడా! నీపొగ రడఁగించెద. నిమేషమాత్రము నిల్వుము. (శతఘ్నిం బేల్చుచున్నాఁడు. కొందఱుసైనికులును రానును గతాసులగుచున్నారు.

హస—ధర్మారాయనితో సంకులసమరంబుఁ గావించుచున్నాఁడు. ఇద్దఱును భూమిపై నొరఁగుచున్నారు. పారసీకపుసేన కలకలము నొందుచున్నది.

[హైదరు ప్రవేశించుచున్నాఁడు.]

హైద—ఆహా! ఎంత పుట్టినది. నిష్కారణ మనేకులు పారసీకధీరాగ్రేసరు లసురులం బాసిరి. ఇస్సీ!

వెంగ—ఏఁడీ! పారసీకాధముఁడు. ఏఁడిరాజు! నానిశితకరవాలంబున వారిశిరంబులఁ దెగవేసి తద్రక్తప్రవాహంబున మజ్జనంబుఁ గావించి కీలాలధారలం మదగ్రజునకు స్నానాదిక్రియలఁ గావించుచున్నాఁడ.

పంచచామరము. ఎక్కడన్ మొఱంగియుంటి వేది నీదుశౌర్యమున్
దక్కలేక జాపు మింక దప్ప దోరి పోరు పెం
పెక్క నన్ను గెల్వఁ గల్గుదేని రమ్ము రాజ! వే
నిక్కుచుంటి విప్డు నీదు నేటుశక్తిఁ జూపగా.

హైద—ఏమిది సైనికులారా! విజయరామరాజా!

మాలిని. ఇంతటిభీమవిరావ మ దెచ్చట నేర్పడుఁ గర్ణకఠోరము నై
చింత మనంబునఁ గల్గెడి భూమిప! చెప్పుము వెంగళరాయఁడొకో?
యింతకుఁ గారణ మీవ సుమీ యిది యిట్లగు నంచుఁ దలంపక నే
నెంతయు బుద్ధివిహీనతఁ జేసితి నీకొని పాపపుఁగృత్య మిలన్.

కవిరాజవిరాజితము.

కొదుగక నీ దగుమాటల నే విని కొండెము గాఁ దలపోయక యుం
బదపడి వారు ననేకవిధంబులఁ బ్రార్థనఁ జేయుచు సంధిని వే
డఁ దలఁప కెంతయు యుద్ధము సేయ నడంగె బలంబుబలంబులు చే
వ దరిగి శూరులు బోయిరి కాలునివద్ద కరాతిశరాతిహతిన్.

ఇప్పు డన్న గతించె ననురోషావేశంబున నింగి ముట్ట నార్చుచు రా జేఁడీ? రాజేఁడీ? యంచు వెంగళ్రాయఁ డదే వచ్చు చున్నాఁడు. నీవే యుద్ధంబునకుఁ బొమ్ము. జయించితివా సరే. లే కున్న నిందపా లగుదువు.

విజ—(తనలో) తురక కఠినముగ మాట్లాడు చున్నాఁడు. నాకు జన్యంబు సేయక తప్పన ట్లున్నది. ఇప్పుడు వెనుకదీయుట పౌరుషము గాదు. కాని,

మత్తకోకిల. భానుఁ బట్టఁగ వచ్చు రాహువుభాతిఁ గాన దహించు దా
వానలక్రియఁ గాలమృత్యువువన్నె వెంగళరాయఁ డెం
తేని రోషవిభీషణాకృతి నిట్లు మార్కొన వచ్చెడిన్
వీని నోర్వఁగ నెట్లు నా కగు వెఱ్ఱికార్య మొనర్చితిన్.

(అని కొంచె మనుమానించు చున్నాఁడు.)

హైద—ఏ మి ట్లనుమానించు చున్నాఁవు?

పంచచామరము. పౌరుషంబె రాజ నీకుఁ బారిపోవు టెంతయున్
వీరు లేర్చి పైకి రాఁగ బీర మేది భీతిచేఁ
బోరి చచ్చినన్ యశంబె పూరుషాళి కాజిలోఁ
బారుకంబె హైన్య మెద్ది పాటిసేయ భూస్థలిన్.

విజ—(తనలో) ఎట్లయిన నం గానిమ్ము. శత్రుసముదాయంబుతో సముదాయం బొనర్తుఁగాక. (ప్రకాశముగా) ఇదే చూతము ప్రతాపము.

వెంగ—(తనలో) నే నెక్కఁడ మిగిలినాఁడను. మిగిలినవార లయ్యయిచోట్లఁ గలహం బొనరించి వీరులం జంపి తాము న గతాయువు లైరి. అదృష్టమువలనఁ



బ్రయోజన మేమి? ఆయోధులతో నాయోధనం బొనర్చెదఁ గాక. (ప్రకాశముగా)

వనమయూరము. హైదర! నరాధమ! మహాకలుష! దుశ్శీ
లా! దగునె? నీ కిది ఫలం బనుభవింపన్
గా దనెదు మదిప్రపున్కైతవపుమాటల్
ఖేదమును నీకుఁ గలిగింప కెటు దప్పున్.

హైద—ఓహో! భయంకరాకృతి నీవచ్చువాఁడు వెంగళరాయఁడే కాఁబోలు

వెంగ—ఓరీ! పారసీకాధమా! క్రూరచిత్తా! నావిరోధిరాజుమాటలు విని యన్యాయంబుగ మాపై యుద్ధమునకుఁ బూనితివి గదా! ఇం కెక్కఁడి కేగెదవు. నీ బ్రతుకు నంటెంటఁ గుండె ల్జొచ్చినచంద మయ్యెను. మిమ్ములనిద్దఱి నిప్పుడే లోకాంతరంబున కనుపుచున్నాఁడ. అచ్చటి కేఁగి మాయన్నగారిని శరణు వేఁడుఁడు. అట్లు గాక మీయాత్మలకు జన్మాంతరంబునం దైనను సుఖంబు గలుగ నేరదు. (శతఘ్నిం గాల్చు చున్నాఁడు)

విజ—అట్టివృథాప్రలాపంబుల నేల పల్కెదవు? చూడు మిదే. (అని స్వధితిం ద్రిప్పి వేయు చున్నాఁడు.)

వెంగ—(తప్పించుకొని) ఓరీ! రాజన్యాబ్ధిబడబానలా! బాలిశా! తురకకు లంచమిచ్చి మాయావరణంబు విధ్వంసనంబు గావింప నుంకించి వారిని మాపైఁకి దెచ్చితివి గదా! నిన్ను యమాలయంబున కనిపి నీదేశము నీదెస్వాధీనము చేసికొనుచున్నాను గోడపెట్టు చెంపపెట్టు నీ కగును.

విజ—బుద్ధిహీనుఁడా! నాతో సరి పత్తువురా! ఏమి యీ కారుప్రేలాపన?

వెంగ—

అంబురుహవృత్తము. ఓరి! తురుష్కుల వేఁడితివా! మము నోర్వఁజాలక పోరఁగ
న్వీరుఁడవే! రథశూరుఁడవే! కౌరవిన్ దలం దగఁ గోకికో
నేరు దలంతురు దుర్మతి? నీచుఁడ! యిట్టిచేతలు చెల్లునే?
ధారుణిలో జయమొందెదవే? యిఁకఁదక్క నేర్తువె యాజిలోన్.

విజ—ఛీ! ఓటిచేదను నీరుగారున ట్లి ట్లేల ప్రేలెదవురా!

తరళ. వినర! దుర్మద! నీదుగర్వపువేఁడబం బడఁగించెదన్
మనఁగ నేర్తువె న న్నెదుర్కొని మానుసాధమ! యాజిలో

గనవె నీయనుజుండు నీగతిఁ గారుకూతలఁ గూసిగా
చనెను బెద్దలచాయ కిప్పుడు చాలు పేరిలుట దుర్మతీ!

అని ముద్గరంబు వేయు చున్నాఁడు.

(వెంగళ్రాయఁడు దానిం ఖండించు చున్నాఁడు. ఆపైని భిండివాలపరశుపట్టిస ముసలతోమరఛురికాసివివిధాయుధనికాయంబులఁ బ్రయోగించుచు బాహాబాహిం గచాకచిం ఘోర మగుసమరం బొనర్చు చున్నారు.)

[బుస్సీ ప్రవేశించు చున్నాఁడు.]

బుస్సీ—(ఇరుదెఱంగులవారుం బోర నారసి వెంగళ్రాయని శౌర్యంబునకు మెచ్చినట్లభినయించుచు) భళీ! వెలమలకుఁ జాలినశూరులు మాయందుఁగాని తురకలయందుఁగాని తక్కినహిందువులయందుఁగాని నేఁ గాన. ఇట్టివీరులతోనా యుద్ధము? డబ్బున కాసించి హైదరుమాట వింటి. తుద కేమౌనో. (అని దూరము నిల్చి చూచు చున్నాఁడు.)

వెంగ—ఓరీ! పారసీకాధమా! నిలువరా నాయెదుట.

హైద—ఓరీ! నీచా! రాజద్రోహీ! నీపొగ రణంచెదఁ జూడురా. (అని తుపాకిని బేల్చు చున్నాఁడు.)

[ఘోరయుద్ధము జరుగుచున్నది.]

వెంగ—(తనలో) బలం బరిగె. బలంబునుం దరిగె. నే నెట్లు బోరఁ గలవాఁడ? జీవచ్ఛవంబుమాడ్కి నున్నవాఁడను కాయంబు గాయమయంబై యున్నది. సాయంతనంబు నయ్యె. పాపయ్యరాజాముకోటనుంచి వచ్చినట్లు విను చున్నాఁడ. వారితోఁ గలసి రేపు సమరంబునకుఁ గడంగితినా బాగుగ నుండును. స్వల్పసేనతో బోరుటంజేసి మై వలసట వొడమెడిని. వెనుకసహాయమున కైన నేరును లేరు. (అని పరిఘంబు ద్రిప్పి హైదరుతలపై విసరి వైవ, హైదరు తత్పరిఘాతనాహతిచే సోలి నేల మూర్ఛిలు చున్నాఁడు)

[సేనా కలకలము. బొబ్బిలివారి భేరీ మ్రోగు చున్నది. పారసీకుల హాహాకారంబు లెసంగు చున్నవి. విజయరామరాజు బుస్సీ హైదరు శరీరంబు జేరు చున్నారు.]

బుస్సీ—వీరవరులారా! ఈరోజునకు యుద్ధము చాలింపుఁడు. (అందఱు నాగు చున్నారు.)



(హైదరుశరీరంబు వీక్షించి ముక్కుపై వేలుంచుకొని) ఆహా!

అగ్రాకాంతవృత్తము. ఔరా! హైదర్బల మెడలి నీవాజిలోఁ గూలితే నీ
వీరావేశం బెట కరిగె నీవీరుతోఁ బోర నేలా?

(వెంగళ్రావుం జూచి) ధీరా! వెంగళ్నృపతికల! నీధీరత న్మెచ్చ వచ్చుం
బోరాటం బందు నిను గెలువం బోవువా రెవ్వ రిందున్.

(విజయరామరాజుం జూచి) ఓయీ! యింకను బోరెదవా?

విజ—ఖిన్నుఁడై యూరకుండె.

బుస్సీ—(హైదరునాడిఁ బరీక్షించి) నిష్ఠురఘాతిచేఁ బ్రాణము కడంటి మూర్ఛిల్లి యున్నాఁడు. సైనికులారా! యితనిని మనగుడారంబునకుఁ గొనిపొండు. విజనంబగు స్థలంబునకుఁ గొంపోయినం గాని నేద దీరి తెప్పిరిల్లఁడు. (సైనికుని హైదరు నెత్తుకొని పోవు చున్నారు.) (వెంగళ్రావుం జూచి) వెంగళ్రాయఁడా! నీశౌర్య మనివార్యము. నేమెచ్చితి. కొత్తపలిసీమ నీకిచ్చితి. రాజాముతోపాటు దాని నేలుకొనుము. సేవకా! మనపాలాలో నున్నచినరంగారావు నిటుల నెత్తుకొని రమ్ము.

సేవ—చిత్తము దేవరా! (అని పోయి వెంటఁగొని వచ్చు చున్నాఁడు.)

బుస్సీ—వాని నెత్తుకొని ముద్దాడుచు వెంగళ్రాయఁడా! ఈపిల్లవాని నెఱుఁగుదువా? నీయన్నకొడు కగు చినరంగారావునుమీ! బాగి వీని నెత్తుకొని సామర్లకోటకుఁ దీసికొని పోవుచుండ నీబాలునిముఖం బాచంద్రబింబమును హసించుచు నెంతయు ముద్దు లొలుక నాకు వీనియందుఁ బుత్రవాత్సల్యత మీఱి యిసుమంతయు హాని గలుగకుండునట్లు గాపాడుచు నా డేరాయం దుంచినాఁడ. ఈముద్దుల కుఱ్ఱఁడు తండ్రికంటె నెక్కుడుధైర్యశాలి. త్రియావర్షవయస్కుండయ్యును గుడారంబునం గల బహువిచిత్రవివిధగాండారాదివస్తుసంతానసంకులభాండారంబున నీబాలుం డిడువ నొక్కకాతాసిఁ జేఁ బూని యాచిత్తరుపుంబొమ్మల వీరులఁగాఁ దలపోసి నరుకఁ జొచ్చె. ఈబాలుం డపరిమితశౌర్యశాలి యగు. సత్వరము వీనిం దీసికొనుము. (అని వెంగళ్రావున కిచ్చు చున్నాఁడు.)

వెంగ—(వాని నెత్తుకొని ముఖము నివుఱుచు సన్నం దలంచుకొని చింతించు చున్నాఁడు.)

బుస్సీ—ఊరడిల్లుము. విచారించిన నేమిప్రయోజనము గలదు?

వెంగ—(బాలుం జూచి)

ఉ. బాలక ! చిన్నికుఱ్ఱ ! పసివాఁడ ! కటా ! చినరంగరాయ ! నీ
పాలిటి కేగుదెంచెనొకొ పాపపుయుద్ధము నిన్నుఁ జూడఁగాఁ
దాలిమిఁ దూలు చుండెఁ దలిదండ్రులులేనియనాథఁ జేయ నే
లీలను జాలి దైవ మెడలించెనొ నీయెడ ముద్దుకుఱ్ఱఁడా !

(అని యనేకవిధంబుల వనరు చున్నాఁడు.)

బుస్సీ—రాజా ! ఊరడిల్లుము. మీవంటి తెలిసినవా రిట్లు చింతపాలు కాఁగూడదు. సమస్తము దైవాధీనము గదా !

వెంగ—అత్యంతప్రేమాస్పదుం డగుసోదరవియోగం బెట్లు సహించువాఁడ జననీజనక రహితుం డగునీముద్దులపట్టిమోము నవలోకించి యెట్టిదుఃఖము భరించువాఁడ. (విజయరామరా జేమో విచారించుచున్న ట్లభినయించుచు సమీపస్థలంబున నిటు నటు దిరుగు చున్నాఁడు.)

బుస్సీ—ఏమి సేయఁగలము? నిన్నుఁ జూడ నాకును జాలి కలుగు చున్నది, యీరాజు మాటలు విని స్తైాదర్జంగు పొరబడి మీకిట్టియపకార మొనర్చె. వారిసలహా విని నేనును వారితోఁ గలసితిని. కుక్కతోకఁబట్టి గోదావరియీదిన ట్లాయె నా చరిత్ర. నీవిఁ కేల దుఃఖించెదవు. గడచినదానికై వగచుట గతజలసేతుబంధనము. నీవైన నిఁక సుఖం బుండుము.

(అందఱు నిష్క్రమించు చున్నారు.)



ప్రదేశము—బొబ్బిలికోట.

[వెంగళ్రావుగుడారములో గాయములచే బాధపడుచు మూల్గుకొను చుండఁగాఁ దాండ్రపాపయ్య ప్రవేశించు చున్నాఁడు.]

పాప—వెంగళ్రావుగారూ ! (దుఃఖముతో) ఏటుల నున్నారు?

వెంగ—ఇట్లున్నాను. (అని దేహముం జూపుచు దీనస్వరముతో) ఈకోటకు మాకు నిట్టియవస్థ తటస్థ మైనది. ఇప్పటికి యుద్ధము మాని మూఁడురోజు లైనది. ఇరు వాగులవారమును గాయముల మూల్గుకొను చున్నాము. నాబ్రతుకు కనిశ్చయముగ నున్నది. విజయరామరాజు బుస్సీయును సుఖంబుగనే యున్నారు. అన్న కగ్ని సంస్కారాదికంబుల నైనఁ జేయ శక్తిలేదు. ఇట్లు పడి యున్నవాఁడ. ఏమి చెప్పఁగలను? ఇప్పటికి మాలో నే నొక్కఁడ సజీవుండ నైయుంటి. ఇఁక నీపిల్లవాని స్థితి యేమానో?



పాప—(రంగారావుం దలఁచుకొని)

శా. రంగారాయనృపాల ! ధైర్యగుణధుర్యా ! శౌర్యగాంభీర్యసం
సంగా ! రాజకులీనరత్నమ ! రణోత్సాహా ! ధనుశ్చాతురీ
గంగానందన ! యన్న ! బొబ్బిలిపురక్ష్మానాథ ! పోరంగటా
భంగం బొందితె ! శత్రు వా విజయుచేఁ ! బాటిల్లెగా మృత్యువున్.

రంగారాయా ! ఇంకను శాత్రవజయంబుతోఁ బ్రాజ్యరాజ్యలక్ష్మిం గైకొని యఖండ వైభవము ననుభవించెద మనుకొంటిం గాని యవియన్నియు శశవిషాణంబు లయ్యెం గదా ! హా ! దైవమాయ ! అమ్మా ! మల్లమ్మదేవీ ! నీవును భర్తగారికిఁ దోడ్పఁజూపి తే ! అప్పా ! నీ కెంతదెస గల్గినది. ఎంతపని జరిగినది.

శా. అమ్మా ! మల్లమదేవి ! సాధ్వీమణి ! మాయప్పా ! సుశీలాత్మ నీ
కిమ్మాడ్కి న్గడుదైన్య మబ్బ ననినే నింతైన నెంచంగ లే
దమ్మా ! నీ దగుధర్మవర్తనము గాయన్ లేదె నుంతైన? జీ
వమ్ముల్ పాంఘికమృత్యు వెక్కరణి సంప్రాప్తించె మీకియ్యెడన్.

(కోట నల్దిక్కులం గలయం జూచుచు) ఆహా ! స్త్రీబాలవృద్ధసంకులం బైయుండు నీ కోట కెంతపాటు వాటిల్లె. ఓహో ! దివసపంచకంబువెనుకఁ గలకల నాడుచుండెడి బొబ్బిలికోట నేఁటికి భూతప్రేతపిశాచంబుల కిలకిలధ్వని సంకులంబై పరేతవాటిక యయ్యె.

చ. వెలవెలఁ బారు గేహములు, వెల్మకొలంబుల జాడలే, దిదే
వెలపలలోపలం గనినభీతి జనించెడిఁ, గోటకాళికా
నిలయము వోలె శాకినులు నిండ, మనంబున వేదనంబు వ్యా
కుల మొనరించుచుండె నివి గోపలలాస్థిమయాసృధారలున్.

హా ! రంగారాయక్షితీంద్రా !

గీ. నన్ను రాజాయకోటకు మున్నె యేల । కాపుగాఁ బంపినాఁడ వక్కాలమందు
నేనె యుంటి నాశత్రుల నెగడకుండఁ । జేయు నే రంగరాయచేసేత వచ్చె.

అనేకవాదములఁ జేసిన ననేకవిధంబుల నేడ్చినను బెడచెవిం బెట్టి పట్టి పంపితివి గదా! ఎంతవెఱ్ఱిపనిఁ జేసితివి. నీయాజ్ఞోల్లంఘనంబునకు వెఱచిపోవక తప్పదయ్యె. తిరిగి వచ్చునంత కైనను సజీవులై యుంటిరి గారు గదా !

ఉ. పున్నెపులోకముల్ మిగులఁ బొందఁగ మీకిదె చేయు చుంటి నా
కన్నుల నీరు నించి కడఁకన్ జలతర్పణ మివ్విధంబునన్

జన్నది వచ్చునే యింకను సాహసముం గని శత్రురక్తసం
పన్నత మీకుఁ దృప్తిపఱుప న్దలపోయుచు నుంటి నియ్యెడన్.

(వెనుకకు వచ్చి వెంగళ్రాయనిఁ జూచి) (దుఃఖముతో తనలో) ఈతనితో ముచ్చటించిన నేమగు? తన్నుఁ దా నెఱుంగఁడు గాయంబులచే స్మృతి దప్పి యున్నాఁడు దైవ మీతని నైన రక్షించుఁ గాత. ఈబాలునికిఁ జిరాయుష్య మగుఁగాక. విచారించిన నేమిప్రయోజనము, ఇప్పుడైన నేమి పోయె. పారసీకపరానులతోడ విజయరామరాజుం గతాసునిం జేసి బొబ్బిలిపౌరుషంబు నిలుపం బెట్టెదను.

శా. చండారాతిహయప్రకాండముల నేఁజక్కాడెదం గుంభినుల్
దుండంబు ల్దెగి ఖండఖండములుగాఁ దూటాడెదం, బంట్లను
ద్దండప్రక్రియఁ జెండి వైచెదను దోర్దండప్రతాపంబునన్
గండ ల్గొండలు గాఁగ, స్యందనకులన్ ఖండింతు నొక్కుమ్మడిన్.

కానిమ్ము. (తనలో) రామచంద్రుం డంతటివాఁడు వాలిం బొంచి పొరిగొన లేదా? అర్జునుండు మఱుగు వెట్టి గంగాసూనుం దెగ నేయ లేదా? కుంభజహరణార్థమై ధర్మరాజు బొంకియుండ లేదా? వారి కెట్టియపవాదము వచ్చెనో నాకు నదే రాఁగలదు. గూఢగతి నరిగి యిట్టిదురాత్ములఁ జంపినం గాని వేఱొండువిధంబున నాకోపానలంబు చల్లార నేరదు. ఇట్లు గాక నీతులువల్లం జంపుమార్గంబు లేదు. ధర్మమే గానిమ్ము అధర్మమే గానిమ్ము! ధర్మాత్ములు సుగుణనిధు లుత్తమోత్తము లగు రంగారాయమల్లమ్మాదేవులం జంపించినయీపాతకి యగు రాజుం భూమిం బ్రతుకనిచ్చితి నా ధారుణి కప్రియ మొనరించినవాఁడ నగుదును. (ప్రకాశముగా) సేవకా! నీవేఁగి విజయరామరాజున్నస్థలముం గలయం గనుంగొని రమ్ము.

సేవ—చిత్తము (అని వాఁడేఁగి తిరిగి వచ్చి) మహాప్రభూ! నాకుం బో వీలుగాదయ్యె. ఏమి సేయుదు?

పాప—పోనిమ్ము. నేనే పోయెదం గాక. (తనలో) సేన మాఱువేషము వైచికొని వారిగుర్తుమాటలు వచించుచుఁ గాదారి పొద్దున లేచి పోయి గుడారంబుఁ జేరెదను గాక. (అని యట్లొనరించు చున్నాఁడు)

(అందఱు నిష్క్రమించు చున్నారు.)



ప్రదేశము—విజయరామరాజుగుడారము.

పాప—(రాజు నిద్రించు చుండఁగా గుడారంబుగుడ్డను గరవాలంబునఁ జించి వైచి లోపల బ్రవేశించి పులి పులి! యని కేక వేయు చున్నాఁడు.)

విజ—లేచి (తనలో) పులి పులి యని విన వచ్చు చున్నది. ఈపులి తాండ్రపాపయ్య గాని వేఱు గాదు. (కన్నులం దుడిచికొని-లేచి పాపయ్యం గని మిగులలావైన వాఁడు గాన దిగ్గున లేవ లేక) (ప్రకాశముగా) ఎవఁడవురా! (అని చెంత నున్న కత్తిం దీసికొనఁ బోవు చుండఁగా)

పాప—

గీ. తాండ్రపాపయ్య యనువాఁడఁ దగినయట్లు । నీవు చేసినదుర్మార్గనీచకృత్య
మునకు మామక బాహాసి మొనసు విశద । పడఁగ ఫలమియ్య వచ్చినవాఁడఁ జుమ్మి

(అని హఠాత్తుగఁ జేయి నఱుకు చున్నాఁడు. పెరచేతిని దీసికొనఁ బోఁగా దానిం గూడ నఱకుచు) ఏమిరా! పాపిష్ఠ! చండాలుఁడా! నీక్రూరకర్మము నిన్నుఁ గట్టి కుడిపినదిరా. బొబ్బిలి నేలెదవా? (అని కాలు నఱుకు చున్నాఁడు. రంగారావుం జంపి తినని సంతసించు చున్నావా? (అని యూరువుల నఱుకు చున్నాఁడు. ఇట్లు ముప్పది మూఁడుచోట్ల నఱికి చిత్రవధ గావించు చున్నాఁడు.)

[సైనికులు ప్రవేశించు చున్నారు.]

(ఘోరమగు కలకలము.)

సైని—(పాపయ్యం జూచి, ఎవ్వఁడవురా! దుర్మార్గా! దొంగా! (అని యొక్కపెట్టునఁ జుట్టు ముట్ట హైదరును మూర్ఛఁ దెలిసి యున్నవాఁడై ప్రవేశించు చున్నాఁడు.

హై—ఓరీ! క్రూరాత్మా! నీచుఁడా! దొంగా! చూడు నిన్నేమి చేసెదనో! రాత్రి వచ్చి యిట్లు చేసితిగా! నిన్నిప్పుడ పొరిగొనెదఁ జూడు.

[అని భీమాట్టహాసము చేయు చున్నాఁడు.]

పాప—(తనలో) నేను బగ దీర్పఁ బూని చేయవలసినదానిం జేసితి. వీరంతకంతకు రోషంబు మీఱఁ బై పైకి వచ్చు చున్నారు. రంగారావును జంపినరీతినే నన్నుం జంపుదురు.

ఉ. నీచపరానుసేనలకు నేనిటు లోఁబడి చచ్చుకంటె బా
హాచలితాసిధారను బరాసుఁడ నై దివి కేఁగ మేలు గా

దే ! చిరకీర్తిపౌరుషము లెంతయు నిల్చును భూమిలోన శౌ
ర్యాచరణం బొనర్చె నని ? అట్లె యొనర్చుట మంచి దెంచఁగన్.

(పరికాళయము గా) నీచులారా ! మీచేఁ జచ్చెదనా ! నా కిప్డు తృప్తి యైనదిరా ! (తనలో) రంగారాయమల్లమ్మలు లేనిబొబ్బిలికోటఁ దిరిగి చూచుటకంటె దేహంబు దొఁరంగుటే మేలు. (అని రోషావేశంబునఁ గరవాలంబుఁ ద్రిప్పుచు శత్రువులపైఁ బడి సైనికనికాయంబును గాలుపోల్రిలి కనిచి తాను బొడుచుకొని మేనుదొఁరంగు చున్నాఁడు.)

[సైనికులహాహాకారంబు లెసంగ బుస్సీ ప్రవేశించు చున్నాఁడు.]

బుస్సీ—(ఆశ్చర్యముతో ముక్కుపై వ్రేలుంచుకొని తనలో) ఆహా ! ఎంతపని చేసె పాపయ్య ! వీఁడే యుద్ధసమయంబున నున్న మమ్మందఱి నప్పుడ చంపి నైచును. క్రూరకర్మము పాపిష్ఠులం గొట్టుకొనిపోయె. న్యాయాన్యాయంబుల దైవ మెఱుంగఁడా ? పరుల కపకార మెంచువాఁడు తనకుఁ దానే నశించును. (వెంగళ్రాయనిగుడారంబునకుఁ బోవు చున్నాఁడు.)

(అందఱు నిష్క్రమించు చున్నారు.)

ప్రదేశము — [illegible]గళ్రావుగుడారము,

[మంత్రి మొదలగువారు కూర్చుండి యుండ బుస్సీ ప్రవేశించు చున్నాఁడు.]

వెంగ—లేచి సలామ్. బుస్సీగారూ !

బుస్సీ—సలామ్. ఆరోగ్యుఁడ వైతివే ?

వెంగ—స్వామీ ! నెమ్మదిగా నుంటిని. గాయంబులు మానె. మీకటాక్షంబునఁ బ్రాణంబులుమాత్రము నిలిచె.

బుస్సీ—ఇఁక వగఁ జెందకుము. దైవంబు న్యాయంబు చేకూర్చె. నిష్కారణము మిమ్ముల బాధ పెట్టినహైదరుగరువం బడంగె. రాజును జచ్చె. పాపము పాపయ్యయుఁ బ్రాణంబులఁ దొఱఁగె. బొబ్బిలినిఁక నీవే యేలుకొనుము. సుఖంబుండుము. నామాటయే కొలు. అయినదానిఁగురించి విచారింపకుము. శూరులగువారికే యిట్టికష్టంబులు సంప్రాప్తమగుఁ గాని పెరవారలకు యుద్ధము లేల? చావు లెక్కడిది ? నీకుఁ క్షేమ మగుఁ గాక. పట్టాభిషిక్తుండవు గమ్ము. నేను బోయి వచ్చెద.

వెంగ—మహాప్రసాదము స్వామీ !

(బుస్సీ నిష్క్రమించు చున్నాఁడు.)



ప్రదేశము - కళ్యాణమంటపము.

వెంగళ్రావుపట్టాభిషేకమహోత్సవము.

[మంత్రులు, స్నేహితులు, బంధువులు, పౌరులు, చేరు చున్నారు.]

మంత్రి—(సమస్తమంగళద్రవ్యంబు లాయత్తపఱచి పురంబు శృంగారంబు గావించి నృత్తగీతవాద్యంబు లెసంగ సభాస్థానంబున సింహాసనంబు దెప్పించి వైచి యందు వెంగళ్రాయ నునిచి మహోత్సవము జరిగించుచు) వెంగళ్రాయాగ్రణీ ! ఈయఖండ భూమండలంబునకు రాజవు గమ్ము. మమ్ము చరితార్థులఁ జేయుము. ఇదియ పుర జనులకోరిక. అట్లనుగ్రహింపుఁడు స్వామీ !

వెంగ—(దీనత్వము ముఖమునందుఁ దోఁప) అట్లనే కావింపుఁడు. పట్టాభిషేక మహోత్సవము జరుగు చున్నది. అందఱు మంగళాక్షతల వెంగళ్రావుపైఁ జల్లు చున్నారు. బ్రాహ్మణులకు నమస్కరించు చున్నాఁడు.

బ్రాహ్మ—దీర్ఘాయుష్మాన్ భవ. అని దీవించు చున్నారు,

వెంగ—అన్నం దలంచుకొని.

శా. అన్నా మొన్నటిదాఁక నీవు నిజబాహాటోప మేపార సం
పన్నప్రక్రియరాజ్యము న్నలిపి యేపాపంబొ నీ విప్డు డా
పన్నత్వంబును బొందిపోయితివి నాపాజ్ఞసి యీభూమి నీ
కన్నం బోదును ముందె యీవిధము నా కావంతయున్ దోచినన్.

మంత్రి—ఊరడిల్లుము. రాజా ! శుభసమయంబున విచారింపుట కూడదు. "దైవాధీనంజగత్సర్వ" మనువాక్యములఁ దెలియమే ? ఈకాలంబున కీరీతిగ జరుగవలసిన దని బ్రహ్మ వ్రాసియుండఁగా నన్యథా యెట్లు జరుగ నేర్చు ? వీరు చంపిరి వారు చంపి రనుకొనుట యెంతయు వెఱ్ఱితనము. సమస్తచరాచరంబులకార్యంబులకుఁ బరమేశ్వరుఁడే మూలకారణము గాని వేఱు కాదు. నే నొనరించితి ననువాఁడు పిచ్చివాఁడు. భూమిపై నెందఱిని జూచి యుండ లేదు. ఎందఱు రణనిహతులు కా లేదు. రామాదు లగుమహారాజులును హరిశ్చంద్రాదిచక్రవర్తులును భూమిపై నుట్టి గట్టుకొని యూఁగుచున్నారే ! వారికీర్తి మాత్ర మాచంద్రతారార్కము జగద్వ్యాప్తమై తుఱంగలించు చున్నది. అట్లనే మీకీర్తియును భూమి యెంతదనుక నుండు నంతకాలము నుండక పోదు. మనంబున సంతసంబు మల్లడింప నుత్సా

హంబు మీఱియుండుటే మీవంటిఘనులకుఁ బరమోత్తమ మగుతెఱంగు. ప్రపంచమున జరుగుకార్యంబుల సాక్షిభూతుల మై చూచు చుండుటయే మనపని. "కాతే కాంతా కస్తేపుత్ర స్సంసారో యమతీవ విచిత్రః। కస్యత్వం కఃకుత ఆయాతస్తత్త్వం చింతయ యదిదం భ్రాంతిః" అనునట్లు వీరందఱు దైవ మను నాటకునిచే నాడించుజంత్రపుబొమ్మలు గాఁ దెలియఁ దగు. తనువులశాశ్వతములు గదా! కిం దాకుమీఁదాకువాసి గాదే. వారికై వగవ నేల? సమస్తధర్మంబులు మీకు గోచరములే.

వెంగ—మంత్రిపుంగవా! నీ చెప్పిననీతి నామనంబునం గలచింతం గొంత దో్రిచి నైచినది. నీవంటిధీసచివుండు గలుగఁగ నెట్టికొఱంతయు లేదు. నే నొక్కదానిం జెప్పెదవినుము. ఈవీరబొబ్బిలి మాయన్నగారగురంగారావుగారిది గదా! తన్నుగాఁ జూచుకొమ్మని యీచినరంగారావును నావశము జేసి పోయినాఁడు. ఈరాజ్యమునం దీపిల్లవాని నభిషిక్తునిం జేసినం గాని నాదుఃఖము చల్లార నేరదు. కావన నీయాజ్ఞని యీయువరాజ్యంబునకుఁ బట్టాభిషిక్తునిగఁ జేసెదను. వానికి యుక్తవయస్సు వచ్చునందాక నేనే రాజ్యము నేసి యాపై నీధరాభారంబు వాని కిచ్చినైతు. అట్టియన్నగారికే లేనిరాజ్యము నా కేల! సచివాగ్రణీ! సమస్తమంగళద్రవ్యంబులఁ దెప్పింపుము.

మంత్రి—సర్వము సిద్ధముగ నున్నవి. రాజా!

వెంగళరంగారావుపట్టాభిషేక మహోత్సవము.

వెంగ—చెంత నున్నచినరంగారావును సింహాసనంబునం దునిచి సభ్యులారా! మంత్రులారా! మిత్రులారా! మాయన్నకుమారుం డగునీబాలుండు వెంగళరంగారాయాభిధేయంబున నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధుల నలరారుఁ గాత. (బాలుని వంకఁ జూచి.)

ఉ. భూతలమెల్ల నేలుము సమున్నతితో, జగదేకవీర ని
ఖ్యాతినిఁ గాంచు రావుకులమంతయు రాజిల, దీర్ఘజీవితం
బాత కుమార నీ కిల, మహావిభవంబు దనర్చుఁ గాత ని
ర్భీతి నరాతిభూపతుల పేర్మి నడంతువుఁ గాత, మిమ్ములన్.

భూసురాశీర్వాదంబులు సెలంగు చున్నవి. దేవతలు పుష్పవృష్టిఁ గురియించుచున్నారు. సమస్తజనులు సంతసించు చున్నారు. (అందఱు నిష్క్రమించుచున్నారు.)



భరతవాక్యము.

మంగళమహాశ్రీవృత్తము.

ఏలుదురు గావుత మహీంద్రులు జగంబుల సమిద్ధతరధర్మగతితోడ
న్మేలొదవుఁ గాత ధరణీసురుల కావులకు మేదినికి మేదురసుఖం బౌఁ
గాలమున వర్ష మిడుఁ గావుతఁ బురందరుఁడు కాశ్యపినిసస్యము లెసంగున్
బాలి విడనాడుచు శుభంబుఁ గను దేశములు ప్రాణులకు నాయువులు హెచ్చున్.

సీ. నిధినవగజచంద్ర నిగదితహాయనాళికంబునకున్ సరిగ న్నయవ్వి
కారిసంవత్సర కలిత వైశాఖమాసంబున శుక్లపక్షంబునందుఁ
బంచమీభాస్కరవాసరంబునకును రచియించినాఁడ నేఁ బ్రతిభ మీఱ
దీని బొండాడపురీనివాసుం డైనభోగేశ్వరునికృపఁ బూన్కితోడ

నిందు భారంబు నాదైవ మందె యుంచి। యఖిలకృతుల కలంకృతి యగుచు సకల
సుకవిజనులచే నీకృతి సొంపుఁ గాంచి। ధరణి మెఱయుత నాచంద్రతారకముగ.

గద్యము. ఇది శ్రీమద్బొండాడపురీనివాసభోగేశ్వరేశ్వరశాశ్వతకటాక్ష
నిరీక్షణప్రసాదితమృదులకవితాధురంధర, భారద్వాజసగోత్రపవి
త్రాపస్తంబసూత్ర కాళ్ళకూరికులకలశార్ణవరాకాకైరవమిత్ర
భోగమాంబాచ్చయామాత్యదంపతీపుత్ర భోగరా
ట్కవికుమారాగ్రేసర. సాంబశివరాయకవి
వరప్రణీతం బైనరంగారాయకదన
సమవాకారంబు సర్వంబు
సమగ్రము.

## సంస్కృతగ్రంథములు.



| | |
|---|---|
| శ్రీ మహాభారతం 3 వాల్యములు | 20-0 |
| శ్రీమద్రామాయణము వ్యాఖ్యానచతుష్టయము | 15-0 |
| సుందరకాండమూలం | 1-0 |
| డిటో తాత్పర్యం | 2-0 |
| అమరం స్వల్పార్థము | 0-8 |
| గురుబాలప్రబోధిక | 4 0 |
| రఘువంశము | 1-0 |
| శబ్దరత్నావళి | 1-0 |
| శబ్దమంజరి | 0-4 |

### నిఘంటువులు.

| | |
|---|---|
| శబ్దరత్నాకరము | |
| ఆంధ్రపదపారిజాతము | 3-0 |
| శబ్దార్థచంద్రిక | 3-12 |
| ఆంధ్రదీపిక | 2-8 |
| శబ్దరత్నావళి | 1-8 |
| నానార్థరత్నమాల | 1-0 |

### వ్యాకరణములు.

| | |
|---|---|
| బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక (మొదటి) | 0-12 |
| బాలవ్యాకరణము | 0-12 |
| సంగ్రహవ్యాకరణము | 0-6 |
| ఆంధ్రవ్యాకరణము తా॥ వెంకయ్య | 0-4 |
| తెలుగువ్యాకరణము బులు॥ పా॥ | 0-6 |
| రావుబహదూర్ కందుకూరి వీరేశలింగం పం॥ 10 వా॥ | 20-0 |
| కవులచరిత్ర (న్యూప్రింటు) | 3-0 |
| ఆంధ్రకవిజీవితములు శ్రీ. గు. శ్రీరామమూర్తిగారు | 3-8 |

| | |
|---|---|
| నీతికథామంజరి (మొదటిభాగం) | 0-8 |
| డిటో రెండవభాగం | 0-8 |
| నీతిచంద్రిక | 0 8 |
| నీతిచంద్రికసంధి | 0-6 |
| నీతిచంద్రికవిగ్రహము | 0-12 |

### వేదాంతగ్రంథములు.

| | |
|---|---|
| శ్రీభగవద్గీత టీకాతాత్పర్యం | 3-0 |
| డిటో తాత్పర్యం | 1-0 |
| డిటో మూలం | 0-6-6 |
| అద్వైతసుధానిధి 1-3 వ భా॥ సాంఖ్యతారకములుగలవు | 1-12 |
| డిటో. 2 భా॥ ఇందుశివస్వరోదయము షట్చక్రనిరూపణము | 1-0 |
| డిటో. 4 వ భా॥ ఇందు అమనస్కమార్గము గలదు | 1-0 |
| డిటో. 5 వ భా॥ అవధూతగీత | 0-10 |
| పరిపూర్ణబోధసిద్ధాంత శిరోమణి | 1-0 |
| సుజ్ఞానదీపము (కీర్తనలు) | 0-12 |
| శ్రీయోగవాసిష్ఠసారం | 0-8 |
| శ్రీ సీతారామాంజనేయసంవాదము టీ. తా॥ వి. క్యాలికో | 3-4 |
| సనారీవిశ్వేశ్వరసంవాదము | 1-0 |
| రామస్తవరాజీయము | 0-6 |
| ప్రశ్నోత్తరవేదాంతరత్నమాల | 0-4 |
| వేదాంతవార్త్తికము | 0-4 |
| ఆత్మబోధామృతరసము | 0-4 |
| తారకామృతసారము | 0-6 |
| శివగీతాతాత్పర్యం | 0-10 |
| ఉత్తరగీత | 0-10 |

దొరకువారు:—కర్రా అచ్చయ్య అండ్ సన్సు, బుక్కుసెల్లర్సు,

రాజమండ్రి.

## ఆంధ్రగ్రంథములు.

| | | |
|---|---|---|
| శ్రీమదాంధ్రభారతము 7 వాల్యములు | రు. 15 | అ. 12 |
| డిటో [illegible] వాల్యంలు | 15 | 0 |
| డిటో [illegible] | 2 | 4 |
| గోపినాథరామాయణము 2 వాల్యములు | 5 | 8 |
| శ్రీమదాంధ్రభాగవతము 2 వాల్యములు | 10 | 0 |
| భాస్కరరామాయణము | 3 | 8 |
| డిటో విక్కిలిదళపరి | 4 | 0 |
| వసుచరిత్ర | 4 | 0 |
| మనుచరిత్ర | [illegible] | 0 |
| [illegible] | [illegible] | 0 |
| డిటో క్యాలికో | [illegible] | [illegible] |
| రాఘవపాండవీయము | 2 | 4 |
| శృంగారనైషధము టీ. తా. [illegible] | 6 | 0 |
| డిటో తా॥ ఆనంద [illegible] | 3 | 0 |
| డిటో మూలం | 1 | 0 |
| చాటుపద్యమణిమంజరి | 1 | 4 |
| బాలవితంతువిలాపము పెస్టచ్చు | 0 | 5 |
| భక్తచింతామణి | 0 | 5 |
| [illegible] | 0 | [illegible] |
| [illegible] | 0 | 8 |
| శ్రీభావతిప్రద్యుమ్నము | 0 | 10 |
| [illegible] రామాయణము | 0 | 10 |
| [illegible] విలాసము | 0 | 12 |
| [illegible] | 0 | 12 |
| డిటో [illegible] | [illegible] | 4 |
| [illegible] | [illegible] | 5 |
| [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | 0 | [illegible] |

| | | |
|---|---|---|
| మృత్యుంజయవిలాసము | 0 | 3 |
| నిరంకుశోపాఖ్యానము | 0 | 6 |
| [illegible] | 0 | 4 |
| [illegible] కీర్తనలు | 0 | 8 |
| నిఘంటుత్రయము క్యాలికో | 1 | 2 |
| డిటో సాదా | 0 | 14 |
| ఆంధ్రనామసంగ్రహము శేషము | 0 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము | 0 | 4 |
| సప్తమస్కంధము టీ. తా. | 1 | 8 |
| డిటో మూలము | 0 | 6 |
| [illegible] టీ. తా॥ | 0 | 4 |
| [illegible] డిటో డిటో | 0 | 4 |
| [illegible] డిటో | 0 | 3 |
| కుమారి డిటో డిటో | 0 | 3 |
| బాలరామాయణము డిటో | 0 | 3 |
| వచనరామాయణము [illegible] వాల్యములు | 12 | 12 |
| డిటో భారతము డిటో | 12 | 5 |
| డిటో భాగవతము [illegible] వాల్యంలు | 10 | 0 |

### [illegible]గ్రంథములు.

| | | |
|---|---|---|
| వైద్యచింతామణి [illegible] వాల్యంలు | 10 | 0 |
| [illegible] | 7 | 0 |
| [illegible] | 6 | 0 |
| అనుభవవైద్యము (కీర్తనలు [illegible]) | 4 | 0 |
| [illegible] | 3 | 0 |
| [illegible] | 2 | 8 |
| [illegible] | 2 | 8 |
| [illegible] నిఘంటువు | 2 | 8 |
| [illegible] | 2 | 8 |
| [illegible] | 1 | 0 |

దొరకువారు:—

కర్రా అచ్చయ్య అండ్ సన్సు

బుక్కుసెల్లర్సు, రాజమండ్రి

